

# చందమామ

ఏప్రిల్ 1993



ఈ సంచికలో కథలు-వింతలు-విశేషాలు






విడి ప్రతి : 4.00

సంవత్సర చందా : 48

మీరు చదువుతున్నారా?

26 సంవత్సరాలకు పైగా
సినీ పరిశ్రమకు
ప్రేక్షక పాఠకులకు మధ్య వారధిగా
నిలిచి, ఇటు పరిశ్రమలోనూ,
అటు ప్రేక్షకులలోనూ
ఉత్తమాభిరుచులను
పెంపొందించడంలో
కృషిచేస్తున్న

ఏకైక మాసపత్రిక

# విజయచిత్ర









# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'　　సంచాలకుడు : నాగిరెడ్డి



## శాంతిశతాబ్దం

గత జనవరి 3వ తేదీ చరిత్రలో చాలా ప్రాముఖ్యతను సంతరించుకున్న రోజు. తమ వద్ద ఉన్న అణ్వాయుధాలను తగ్గించుకోవడానికి అమెరికా, రష్యా దేశాలు ఆ రోజు ఒక ఒడంబడికను కుదుర్చుకున్నాయి. అప్పటి అమెరికా అధ్యక్షుడు జార్జ్‌బుష్, మాస్కో పర్యటనకు వచ్చినప్పుడు, రష్యా అధ్యక్షుడు ఎల్‌స్టిన్‌తో కలిసి ఆ ఒడంబడికలో సంతకం చేశారు.

'ఎస్.టి.ఏ.ఆర్.టి. II'గా పేర్కొన్న ఈ ఒడంబడిక ఏర్పడిన వార్తను అన్ని పత్రికలూ పతాకశీర్షికలతో ప్రచురించాయి: జనవరి 3వ తేదీ ఉదయం, ఉభయదేశాల అధ్యక్షులూ, వారి భార్యలతో కలిసి— క్రెమ్లిన్‌లో బాలబాలికల కోసం ఏర్పాటు చేసిన నూతన సంవత్సర వేడుకలను చూడడానికి వచ్చారు. ఆ వేళకే అక్కడ వేలాది బాలబాలికలతో పాటు వివిధ రంగాలకు చెందిన ప్రముఖులు పలువురు హాజరయ్యారు. ప్రధాన కార్యకర్త ముఖ్య అతిథులను ప్రేక్షకులకు పరిచయం చేశాక, "మన జీవితాలకు శాంతి సమకూర్చే ఒక అద్భుతమైన ఒడంబడిక ఈ రోజు సంతకం కానున్నది," అని చెప్పి, ఒడంబడికలోని ముఖ్య అంశాలను వివరించాడు.

ఆ తరవాత ఆ ఒడంబడికను, అమెరికా అధ్యక్షుడు, 'మానవజాతి ఆశాకిరణం'గానూ, రష్యా అధ్యక్షుడు, 'ప్రపంచరక్షణకు హామీ'గానూ అభివర్ణించారు.



ఈ ఒడంబడికను కేవలం రక్షణకు హామీగా మాత్రమే కాకుండా సంపూర్ణ నిరాయుధీకరణకూ, శాశ్వత ప్రపంచ శాంతికీ, దోహదం చేసేదిగా ఉండాలని యువతరం కాంక్షిస్తున్నది. ఆయుధాలను కేవలం రక్షణకు మాత్రమే ఉపయోగించుకునే రోజులు రావాలి. మునుముందు 'శాంతిశతాబ్దం' కోసం ప్రతి ఒక్కరూ పాటుపడాలి!

సంపుటి 91　　ఏప్రిల్ '93　　సంచిక : 4

విడిప్రతి : 4.00　　సంవత్సర చందా : 48.00



దూరతీరాలలో ఉన్న మీ బంధుమిత్రులకు
మీరు ఇవ్వదగిన ప్రియాతి ప్రియమైన కానుక

# చందమామ



వారికి కావలసిన భాషలో చందమామను అందజేయండి :

అస్సామీ, బెంగాలీ, ఇంగ్లీష్, గుజరాతీ, హిందీ, కన్నడం, మలయాళం,
మరాఠీ, ఒరియా, సంస్కృతం, తమిళం, తెలుగు.

దూరదేశంలో ఉన్నప్పటికీ వారికి మాతృదేశంలో ఉన్న మధురానుభూతిని కలిగించండి।

సంవత్సర చందా :

ఆస్ట్రేలియా, జపాన్, మలేషియా & శ్రీలంక

సీ మెయిల్ ద్వారా : రూ. 105.00 ఎయిర్‌మెయిల్ ద్వారా : రూ. **252.00**

ఫ్రాన్స్, సింగపూర్, ఇంగ్లండు, అమెరికా,
పశ్చిమజర్మనీ & ఇతర దేశాలు

సీ మెయిల్ ద్వారా : రూ. 111.00 ఎయిర్ మెయిల్ ద్వారా : **252.00**

మీ చందాలను 'చందమామ పబ్లికేషన్స్' పేరు మీదుగా డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా గాని,
మనిఆర్డర్ ద్వారా గాని కింది చిరునామాకు పంపండి :

సర్క్యులేషన్ మేనేజర్, చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600026

# కెనడాలో ఘర్షణలు



మరెక్కడయినా మంచిమిత్రులుగా ఉండవచ్చు గాని, కెనడాలో మాత్రం ఇంగ్లీషువాళ్ళు, ఫ్రెంచివాళ్ళు గత రెండు వందల సంవత్సరాలుగా ఘర్షణ పడుతున్నారు. ఇంగ్లాండు, ఫ్రాన్స్ దేశాల మధ్య కెనడా గురించి ఉన్న రాజకీయవివాదాన్ని అంతం చేయడానికీ, కెనడాను సమైక్యపరచడానికీ వీలుగా ఇటీవల ఒక రెఫరెండం అంటే, ప్రజాభిప్రాయసేకరణ జరిపారు. మొత్తం పది రాష్ట్రాలలో ఏడు రాష్ట్రాలు వారి కోరికకు వ్యతిరేకంగానూ, మిగతా మూడు రాష్ట్రాలు అనుకూలంగానూ తీర్పునిచ్చాయి.

ఈనాటి కెనడాను దాదాపు 500 సంవత్సరాలకు పూర్వం అంటే 1497వ సం॥లో ఇంగ్లీషు నావికుడు జాన్ కాబోట్ కనుగొన్నాడు. అతడు అనాడు న్యూఫౌండ్ ల్యాండ్‌నూ, నోవా స్కాషియానూ చేరుకున్నాడు. అనాటి నుంచి ఇంగ్లాండు ఆ ప్రాంతం మీద అధికారం వహిస్తున్నది. మరొక యాభై సంవత్సరాల తర్వాత, ఫ్రెంచి నావికుడు జాకస్ కార్టియర్ ఈనాటి క్యూబెక్‌కు దక్షిణంగా ఉన్న ఒక గ్రామాన్ని చేరుకున్నాడు. అక్కడి రెడ్ ఇండియన్లు ఆ ప్రాంతాన్ని "కానాథా' అని పిలవడం విన్నాడు. కెనడా అనేమాట 'కానాథా' అనే హ్యూరాన్ భాష మాటనుంచే వచ్చిందని చెబుతారు. ఫ్రెంచి ప్రభుత్వం దానిని 'న్యూఫ్రాన్స్' పేరుతో తమ అధీనంలోని ప్రాంతంగా ప్రకటించింది.

17వ శతాబ్దంలో ఇంగ్లాండ్, ఫ్రాన్స్‌ల మధ్య ప్రత్యక్షంగా ఘర్షణలు ఆరంభమయ్యాయి. 1713వ సం॥లో జరిగిన 'ట్రెక్ట్ ఒడంబడిక' ప్రకారం ఇంగ్లాండు కొన్ని ప్రాంతాలను రాబట్టుకున్నది. ఏడేళ్ళు సాగిన యుద్ధం తరవాత 1769వ సం॥లో ఏర్పడిన 'ప్యారీస్ ఒడంబడిక' ప్రకారం కెనడా బ్రిటన్ వశమయింది. మరొక వంద సంవత్సరాలలో క్యూబెక్, అంటారియో, నోవాస్కాషియా, న్యూబ్రూన్స్‌విక్ రాష్ట్రాలు ఒకటిగా ఏర్పడ్డాయి. మరి కొన్నాళ్ళకు వాటితో మానిటోబా, బ్రిటిష్ కొలంబియా, అల్బెరా, సస్కాచ్యువన్ రాష్ట్రాలు కూడా కలిశాయి.

1931వ సం॥లో ఏర్పాటు చేసిన 'వెస్ట్ మినిస్టర్ శాసనం' ప్రకారం, ఆ సువిశాల దేశం బ్రిటిష్ కామన్వెల్త్‌కు లోబడిన స్వతంత్ర ప్రాంతంగా నిర్వచింపబడింది. అయితే, క్యూబెక్

వంటి ప్రాంతాలలో అధిక సంఖ్యాకులయిన ఫ్రెంచి ప్రజలు తమ భాష, సంస్కృతి రక్షణకోసం ఆందోళన జరపసాగారు. ఆ కారణంగా రెండు వైపుల నుంచీ విభజన కోసం ఒత్తిడులు రాసాగాయి.

గత రెండు సంవత్సరాలుగా విభజనవాదాన్ని అరికట్టడానికి తీవ్రమైన ఆలోచనలు, సంప్రతింపులు వాదోపవాదాలు సాగుతున్నాయి. ప్రధానమంత్రి బ్రియాన్‌మల్రోనీ- పది రాష్ట్రాల మంత్రులతో కలిసి రాజ్యాంగంలో కొన్ని సంస్కరణలు తీసుకురావాలని ప్రయత్నించాడు. క్యూబెక్‌కు ప్రత్యేక స్థానం కల్పించడం, సెనేట్‌ను నామినేషన్‌ద్వారా కాకుండా ఎన్నుకునే వీలు కల్పించడం, స్థానికులయిన రెడ్ ఇండియన్లకూ, ఎస్కిమోలకూ స్వయం పాలనాధికారం ఇవ్వడం ఆ సంస్కరణలలోని ముఖ్య అంశాలు. ఈ విషయంలో వాళ్లు 1992 ఆగస్టు 28వ తేదీ ఒక ఒప్పందానికి వచ్చారు.

కాబట్టి ఇటీవల జరిగిన రెఫరెండం ఒకే ఒక ప్రశ్నను మాత్రం అడిగింది: "ఆగస్టు 28వ




తేదీ జరిగిన ఒప్పందం ప్రకారం రాజ్యాంగ సవరణకు మీరు అంగీకరిస్తున్నారా?"

క్యూబెక్ అందుకు అంగీకరించలేదు. ఎందుకంటే, ఆ సంస్కరణల ద్వారా దానికి స్వతంత్ర ప్రతిపత్తి రాదు. కెనడాలో అత్యధిక జనాభాగల ఆంటారియో కూడా ఆ అభిప్రాయాన్ని తిరస్కరించింది. నోవాస్కోషియా, మానిటోబా, సస్కాచ్యువాన్, ఆల్బెర్టా, బ్రిటిష్‌కొలంబియా కూడా ఆ అభిప్రాయాన్ని నిరాకరించాయి. న్యూఫౌండ్ లాండ్, న్యూబ్రన్స్‌విక్, ప్రిన్స్ ఎడ్వర్డ్ ఐలాండ్– ఈ మూడు రాష్ట్రాలలో మాత్రం ఈ అభిప్రాయానికి మద్దతు లభించింది. అయితే, ఫెడరల్ పార్లమెంటు, పది రాష్ట్రాల శాసనసభల అంగీకారంతోనే రాజ్యాంగ చట్టాన్ని సవరించడం సాధ్యమవుతుంది.

రెఫరెండం ద్వారానే కాకుండా ఇతరత్రా కూడా ప్రజల మద్దతు కోల్పోయిన మల్రోనీ ప్రధానమంత్రి పదవిని రాజీనామా చేశాడు.



# సోమరి పిశాచం

తోటపల్లె అనే ఊళ్ళో వుండే పరాంకుశం అనేవాడు పరమబద్ధకస్థుడు, సోమరి. వాడికి చిన్నతనంలోనే తల్లి పోవడంతో, తండ్రి అల్లారుముద్దుగా పెంచాడు. ఇప్పుడు పాతికేళ్ళవయసునిండినా వాడికి ఇక్కడి వస్తువు అక్కడ పెట్టడానికి బద్ధకం. పొద్దున్నే తండ్రి గేదెలపాలు తీసి, నాలుగిళ్ళల్లో పోసి, వంట చేసి పొలం పనులకు పోయాక వాడు నిద్ర లేచేవాడు. తర్వాతభోజనంచేసి, సాయంత్రం దాకా ఊళ్ళోని మిత్రులతో హాయిగా కబుర్లాడుతూ కాలక్షేపం చేసి, చీకటిపడే వేళకు ఇల్లుచేరేవాడు.

పరాంకుశం సోమరితనం ఎరిగిన వాళ్ళు కావడంతో, ఊళ్ళో వాడికెవరూ పిల్లనివ్వలేదు. ఎంతో ప్రయత్నం మీద, నాలుగు ఊళ్ళ అవతలవున్న నాగమణితో వాడి పెళ్ళి జరిగింది. పెళ్ళిలో వాడు, 'తాలిబొట్టుకు మూడుముళ్ళు వేయడం ఎందుకు? ఒక్క ముడి గట్టిగా వేస్తే సరిపోదా!' అంటూ పురోహితుడితో గొడవపడుతున్నప్పుడే, భర్త సోమరితనం అర్థమైపోయింది, నాగమణికి.

ఆమె కాపరానికి వచ్చిన నెల రోజుల తర్వాత, ఒకనాడు పరాంకుశంతో, "అలా తిని కూచుంటే పొద్దెలా పోతుంది! అవతల మీఅయ్యకిఅరవైఏళ్ళుదాటాయి. ఆయనకు పొలంపనుల్లో సాయంగావుండవచ్చుగదా," అన్నది.

ఆ మాటలకు పరాంకుశం ముఖం చిట్లించుకుని, "బావుంది, మహా బావుంది! ఈ రోజు మా అయ్యకు పొలం పనుల్లో సాయపడమంటావు. రేపు నీకు వంట పనుల్లో చేసాయం ఇవ్వమంటావు. నీకు తెలీదు— ఏ శరీర శ్రమా పడకుండానే, నా బ్రతుకు హాయిగా జరిగిపోతుందని, చిన్నతనంలోనే నా జాతకం చూసిన ఒక కోయవాడు చెప్పాడు!" అన్నాడు.

మాచిరాజు కామేశ్వరరావు

ఇలా ఒక సంవత్సరంన్నర కాలం గడిచింది. పరాంకుశం తండ్రి చనిపోయాడు. వాడి భార్య ఒక మగబిడ్డను కన్నది. అయినా పరాంకుశంలో ఎలాంటి మార్పూ రాలేదు. నాగమణి చంటి బిడ్డతో ఇంటెడు పనీ చేసుకుని, పొలం పనులకు కూడా వెళ్ళవలసి వచ్చేది.

ఒకరోజు ఎండ తీవ్రంగా వుండడంతో, పది మాసాల కొడుకును భర్తకు అప్పగించి పొలానికి వెళ్ళింది నాగమణి. ఆమె సాయంకాలం తిరిగి వచ్చేసరికి పిల్లవాడు పెరట్లో వున్న పాతకాలపు దిగుడుబావికేసి పాకుతూ పోతున్నాడు. పరాంకుశం కొంచెందూరంలో ముక్కాలిపీట మీద కూర్చుని, తాపీగా వాడికేసి చూస్తున్నాడు.

ఇది చూసి నాగమణి కెవ్వున అరచి, చేతిలో వున్న తట్టను కింద పారేసి, చప్పున వెళ్ళి కొడుకును ఎత్తుకుని, పరాంకుశంతో, "బిడ్డ, నేను రావడం ఒక్క క్షణం ఆలస్యం అయుంటే బావిలో పడేవాడు. అలా చూస్తూ కూర్చున్న నువ్వు తండ్రివా? కసాయి వాడివా?" అన్నది కోపంగా.

"ఎలాగూ నువ్వు వచ్చే వేళయిందని ఆగాను. అనవసరంగా నేను కూర్చున్న చోటి నుంచి లేచి వెళ్ళడం దేనికి?" అన్నాడు పరాంకుశం నవ్వుతూ.

"ఛీ, నిన్నూ నీ సోమరితనాన్నీ చూస్తూంటే అసహ్యం వేస్తున్నది. ఈ చాకిరీ ఎక్కడ చేసుకున్నా నాకూ, నా బిడ్డకూ ఏ లోటూ రాదు. ఇక్కడుంటే నా బిడ్డకూడా దక్కేట్టు



లేదు," అంటూ కొడుకును తీసుకుని నాగమణి పుట్టింటికి వెళ్ళిపోయింది.

పక్కన వున్న అరుగుకు వారగా ఆనించి వున్న మంచాన్ని వాల్చే వాళ్ళు లేకపోవడంతో, రాత్రి రెండోజామువరకూ ముక్కాలి పీటమీదే కునికిపాట్లు పడుతున్న పరాంకుశం, ఏదో అలికిడయి కళ్ళు తెరిచాడు. అతడికి అరుగుమీద కూర్చునివున్న పిశాచం ఒకటి కనిపించింది.

పరాంకుశంఏమాత్రం భయపడకుండా, "ఇంత అర్ధరాత్రివేళ దేవతలా వచ్చావు! సంగతేమిటి? ముందు ఆ మంచం కాస్త ఇటు వాల్చు," అన్నాడు.

"నేను సోమరిపిశాచాన్ని. నిన్ను చూస్తూనే నువ్వూ సోమరివని గ్రహించాను. నాకుచిన్న సాయం కావాలి. సోమరిపోతును, సోమరిపోతుకాక ఎవరర్థం చేసుకోగలరు? ఎవరు సాయపడగలరు?" అన్నది పిశాచం.

"ఇంతకూ నేనేం చేయాలి?" అని అడిగాడు పరాంకుశం.

"ఒక పలుగూ, పారా తీసుకుని నా వెంటరా!" అన్నది సోమరిపిశాచం.

"అవేవో నువ్వే పట్టుకురా!" అని పిశాచం వెంట బయలుదేరాడు పరాంకుశం.

దారిలో సోమరి పిశాచం, పరాంకుశంతో, "నీకు శ్రమ తెలియకుండా వుండేందుకు, నేను పిశాచం అయిన కారణం గురించి చెబుతాను, విను!" అన్నది.

"సరే, అలాగే చెప్పు!" అంటూ తలూపాడు పరాంకుశం.





బతికున్న రోజుల్లో సోమరిపిశాచం పేరు, సోమయ్య. ఇంటికిపెద్దకొడుకయినసోమయ్య, ఏ బాధ్యతా లేకుండా తిని తిరుగుతూండే వాడు, వాడికి ముగ్గురు మిత్రులు. మొదటి వాడు మహాపాపి, వాడుచేయని పాపకార్యం అంటూఏదీలేదు. రెండోవాడుసర్వదుర్గుణాల పుట్ట. మూడో వాడిలోలోకంలోవున్న వ్యసనాలన్నీ వున్నాయి. సోమయ్య సోమరితనం కొద్దీ, కాలక్షేపానికి వాళ్ళతో కలిసి తిరిగే వాడు. అయితే వాళ్ళచెడుప్రభావం మాత్రం అతడి మీద పడలేదు.

సోమయ్య ఒక్కగానొక్క చెల్లెలు పెళ్ళికి ఎదిగింది. పెళ్ళి ఖర్చులకోసం సోమయ్య తండ్రి పొలం అమ్మి, ఆ డబ్బుతో రాత్రివేళ పొరుగూరునుంచి తిరిగివస్తూండగా, అతణ్ణి ఎవరో అనుసరించి రాసాగారు. వాళ్ళను దొంగలుగా అనుమానించి సోమయ్య తండ్రి డబ్బును ఒక మర్రిచెట్టు కింద పాతి, తన ఊరును సమీపించే సమయంలో వాళ్ళు ఆయన్ని చుట్టుముట్టి డబ్బు దొరక్క పోయేసరికి కొట్టి పారిపోయారు.

ఆ దెబ్బలకు సోమయ్య తండ్రి మంచం పట్టి, చనిపోయేముందు సోమయ్యకు ఆ డబ్బు ఎక్కడ పాతిందీ వివరంగా చెప్పి, అనుకున్న ముహూర్తానికి చెల్లెలిపెళ్ళి అయేలా చూడమన్నాడు.

సోమరి సోమయ్యకు తండ్రి చెప్పిన చోటుకు వెళ్ళి, డబ్బు తవ్వుకు రావడానికి బద్ధకం. తల్లి పోరిన మీదట, ఇంకా రెండు రోజుల్లో పెళ్ళి గడువనగా, ఒక రాత్రివేళ పలుగుతీసుకునిబయలుదేరాడు. ఆపగలు మాటల సందర్భంలో సంగతి గ్రహించిన అతడి దుష్టమిత్రులు ముగ్గురూ, చీకట్లో చాటుగా సోమయ్యను అనుసరించారు.

ఇది పసిగట్టిన సోమయ్య ప్రమాదాన్ని శంకించి, తండ్రి చెప్పిన మర్రిచెట్టు దగ్గిరకు పోకుండా, దారిలో కనిపించిన మరొక మర్రిచెట్టు కింద తవ్వసాగాడు. ఆ సమయంలో పరమదుష్టులైన అతడి మిత్రులు, అతడి మీద చెట్టుచాటు నుంచి ఒక బండ రాయిని విసిరారు. ఆ దెబ్బకు సోమయ్య అక్కడికక్కడే ప్రాణాలు వదిలాడు.

అన్నిటా అన్యాయం జయించదంటారు! ఆసమయంలో ఎవరో ధర్మదేవత ఉసికొల్పి నట్టు మూడు పులులు, గాండ్రిస్తూ వచ్చి, ఆ ముగ్గురు దుర్మార్గుల్నీ చీల్చిచెండాడినై.

సోమరిపిశాచం తన కథ వివరించి, "నేను డబ్బు తవ్వి తెచ్చేందుకు వెళ్ళి ప్రాణాలు పోగొట్టుకోవడంతో నా చెల్లెలి పెళ్ళి ఆగిపోయింది. ఆ దిగులుతో కొద్ది రోజులకే మా అమ్మా, చెల్లెలూ చనిపోవడం జరిగింది. దుష్టస్నేహితులు ముగ్గురూ నరకానికి పోయారు. నేను మాత్రం ఎటూ కాని ఈ లోకంలో తిరుగుతున్నాను," అని ముగించేసరికి, వాళ్ళు మర్రిచెట్టు దగ్గరకు వచ్చారు. పిశాచం చెప్పిన చోట తవ్వి, పరాంకుశం కొన్నినాణాలను బయటికి తీశాడు.

అప్పుడు పిశాచం, పరాంకుశంతో, "ఈ సాయంత్రం నీ భార్యా, కొడుకూ ఈ దారి వెంట వెళుతుండగా చూశాను. నీ భార్య ఆకలితో ఏడుస్తూన్న నీ కొడుకును సముదాయిస్తూ, "ఒక సోమరి కడుపున పుట్టినందుకు, నీకీ కష్టాలు తప్పవు, తండ్రీ!" అన్నది కళ్ళనీళ్ళతో. ఈ డబ్బు తీసుకుపోయి, ఏదైనా వ్యాపారం ప్రారంభించు. భార్యాబిడ్డలను ప్రేమగా చూసుకో. సోమరితనం ఎంత ప్రమాదకరమైందో, నా కథవల్ల తెలిసిందిగదా!" అని, తీతువు పిట్టగా మారి చెట్టు మీదికి ఎగిరిపోయింది.

పరాంకుశం గోతిలోని నాణాలన్నీ పైకి తీసి చూశాడు. అవి ఈ కాలంలో చెల్లని నాణాలు. వాటిని తిరిగి గోతిలోనే పాతిపెట్టి, ఇంటికి బయలుదేరాడు పరాంకుశం.

వారంరోజులతర్వాత, తమ ఊరి మనిషి తెచ్చి ఇచ్చిన జాబు అందుకున్నది పరాంకుశం భార్య నాగమణి. అందులో పరాంకుశం ఇలా రాశాడు: ఇన్నాళ్ళకు, నా తప్పు నేను తెలుసుకున్నాను. స్వయంగా వచ్చి నిన్ను తీసుకురావడానికి, పొలం పనుల్లో క్షణం తీరుబాటు లేదు. నువ్వు బాబును తీసుకుని వెంటనే బయలుదేరి రా.

ఆ జాబు ద్వారా, భర్తలోవచ్చిన మార్పును అర్థం చేసుకన్న నాగమణి కళ్ళల్లోంచి ఆనందబాష్పాలు జాలువారాయి.



# బిచ్చగాడి తెలివి

హేలాపురిలోని ఒక దేవాలయం ముందు, బిచ్చగాడొకడు ముష్టెత్తు కుంటున్నాడు. వాడి ముందు, "గుడ్డివాడిని! ధర్మం చెయ్యండి, బాబూ," అని రాసివున్న పలక ఒకటున్నది.

ఆ దారివెంట వచ్చే వాళ్ళు వాడి ముందు పరిచి వున్న గుడ్డమీద చిల్లర నాణాలు వేస్తున్నారు.

ఒక దాత విసిరిన నాణెం గుడ్డమీద పడి దొర్లుకుంటూ నాలుగైదడుగుల దూరం దొర్లిపోయింది. వెంటనే బిచ్చగాడు లేచి వెళ్ళి, ఆ నాణాన్ని తెచ్చి గుడ్డమీద వేసుకున్నాడు.

ఇది చూసిన దాత కోపంగా, "ఏరా, గుడ్డివాడినని పలకమీద రాయించావు. నీకు కళ్ళు బాగానే కనబడుతూ వున్నాయి కదా! ఇదేం మోసం?" అని అడిగాడు.

దానికా బిచ్చగాడు తొణక్కుండా, "అయ్యా! మన్నించాలి. నేనసలు మూగవాడినండి. పలకమీద రాసినాయన తప్పుగా రాశాడు," అని జవాబిచ్చాడు.

"అలాగా, పాపం! ఈసారయినా కాస్త చదువు సంధ్యలు నేర్చినవాడితో రాయించుకో," అని నొచ్చుకుంటూ వెళ్ళిపోయాడాదాత.

– కోనే నాగవెంకట ఆంజనేయులు






# విచిత్ర పుష్పం

మన దేశంలో ఈశాన్య ప్రాంతాన గల మాణిక్యపురి రాజ్యంలో వసంతరుతువుకు స్వాగతం పలికే వసంతోత్సవాలు యేటా నెల రోజుల పాటు జరిగేవి. వసంతరుతువు రాగానే కొండల మధ్య ఉన్న మాణిక్యపురి రాజ్యం—కొత్త వెలుగునూ, చెట్టూచేమలతో నూతన శోభనూ సంతరించుకుంటుంది. అందుకే కొన్ని వేల సంవత్సరాల నాడు అక్కడ వసంతోత్సవాలను కోలాహలంగా జరుపుకునేవారు.

మాణిక్యపురి రాజు ప్రతాపవర్మ ఆదర్శ ప్రభువుగా కీర్తి గాంచాడు. తండ్రి పుష్యవర్మ కోరిక మేరకు ప్రతాపవర్మ అతి పిన్న వయసులోనే మాణిక్యపురి సింహాసనాన్ని అధిష్ఠించి, ప్రజారంజకంగా రాజ్యపాలన చేసి, తండ్రికి ఆనందం కలిగించాడు. ఆయన మెప్పుపొందాడు.

రాజు ప్రతాపవర్మ తండ్రికి తగిన వారసుడుగా అనతికాలం లోనే ప్రజల ఆదరాభిమానాలకు పాత్రుడయ్యాడు. తన రాజ్యంలో శాంతి భద్రతలు నెలకొల్పడంతో పాటు ఇరుగు పొరుగు రాజ్యాలతో సత్సం బంధాలు నెలకొల్పాడు. ఆ కారణంగా ప్రజలు యుద్ధభయంలేకుండా సుఖసంతోషాలతో జీవించసాగారు.

దేశంలో శాంతి భద్రతలకు కొరత లేదు గనక, అవకాశం కలిగినప్పుడల్లా ప్రజలు వినోద కార్యక్రమాల పట్ల, ఆసక్తి కనబరచ సాగారు. ముఖ్యంగా యేటా జరిగే వసంతోత్సవాలలో స్త్రీలూ, పురుషులూ; పిల్లలూ,



కారులకూ పండితులకూ, కవులకూ కూడా ఆహ్వానాలు పంపారు.

మొదట ఆటల పోటీలు ఆరంభ మయ్యాయి. ఆ పోటీలలో మొదటి నుంచీ ఒక కొండజాతి యువకుడు ఎక్కువ పోటీ లలో విజయం సాధించి అందరి దృష్టినీ ఆకర్షించాడు. మొదట మల్లయుద్ధంలో సునాయాసంగా గెలుపొందాడు. ఆ తర వాత పేముకర్రలతో ఆడే 'కుంజే' ఆట లోనూ అతడే గెలుపొందాడు. ఆ సంవ త్సరం కొత్తగా ఒక క్రీడాపోటీని ప్రవేశ పెట్టారు. ఒక దృఢమైన ఎండు కొబ్బరి కాయను నేలమీద వేసి, గుర్రంమీద వస్తూ చేతిలోని కర్రతో బంతిలాంటి ఆ కొబ్బరి కాయను కొట్టాలి. ఆ ఆటపేరు 'లక్పీ'. ఆ నూతన క్రీడ పోటీలోనూ ఆ యువకుడు తన బృందానికి నాయకత్వం వహించి, అతి లాఘవంగా గుర్రం మీద స్వారీ చేస్తూ, ఎంతో నేర్పుతో బంతిని కొట్టి విజయం సాధించాడు. దానిని చూసినవాళ్ళు హర్ష ధ్వానాలు చేశారు.

పెద్దలూ అమితోత్సాహంతో పాలుపంచు కునేవారు.

ప్రతాపవర్మ మాణిక్యపురి సింహాసనాన్ని అధిష్ఠించి ఇరవై అయిదు సంవత్సరాలు పూర్తయిన సందర్భంగా, ఆ యేడు వసంతో త్సవాలను మరింత ఘనంగా జరపడానికి ఏర్పాట్లు జరిగాయి. కేవలం క్రీడల పోటీలే కాకుండా సంగీతం, సాహిత్యం, నాట్యం, చిత్రకళ మొదలైన లలిత కళలన్నిటిలోనూ పోటీలు ఏర్పాటుచేశారు. ప్రత్యేక అంశంగా కవులూ, పండితులూ పాల్గొనే పండిత సదస్సుకు కూడా ఏర్పాటు చేశారు. ఈ ఉత్సవాలలోపాలుపంచుకోవడానికి ఇరుగు పొరుగు రాజ్యాలలోని క్రీడాకారులకూ, కళా

క్రీడాపోటీలు పూర్తయ్యాక బహుమతీ ప్రదానోత్సవం జరిగింది. రాజు ప్రతాపవర్మ స్వయంగా వచ్చి గెలుపొందినవారికి బహు మతులు అందజేశాడు. ఎక్కువ బహు మతులు అందుకున్న ఆ కొండజాతి యువ కుడి కేసి ఆయన ఆప్యాయంగా చూస్తూ, "నీ పేరేమిటి?" అని అడిగాడు.



"నా పేరు ఉత్తుంగుడు, ప్రభూ!" అని అతడు వినయంగా సమాధానం చెప్పి, తల వెనకకు తిప్పి, తనతో వచ్చిన మిత్ర బృందాన్ని రాజుకు చూపుతూ, "వీళ్ళం దరూ నాతో వచ్చిన మిత్రులు. మేము శృంగ్మాయ్ కొండలలోని ఉత్తుంగ తెగకు చెందిన వాళ్ళం, ప్రభూ! తమ రాజ్యంలో జరిగే ఈ పోటీలలో ఈ సంవత్సరమే మొట్టమొదటిసారిగా పాల్గొన్నాము, ప్రభూ!" అన్నాడు.

రాజు మందహాసం చేశాడు.

ఉత్తుంగుడు వెనక్కు తిరిగి, తన మిత్రు డొకడి చేతిలోని పుష్పగుచ్ఛాన్ని తీసుకుని, చకచకా మెట్లెక్కి వేదిక మీద ఉన్న యువ రాణి ప్రియంవదను సమీపించి, ఆమెకు నమస్కరించి, "తమకు పువ్వులంటే చాలా ఇష్టం అని తెలిసింది. ఇవి మా ప్రాంతంలో పూచిన అపూర్వమైన పుష్పాలు. దయతో స్వీకరించండి!" అంటూ పుష్పగుచ్ఛాన్ని అందించి,వేదికనుంచి కిందికి దిగివెళ్ళాడు.

యువరాణి ప్రియంవద పుష్పగుచ్ఛాన్ని చిరునవ్వుతో తీసుకొని ఆ పువ్వులను ఆనందంగా చూసి, తండ్రి వైపు తిరిగి, "నాన్నా, ఇంతటి అందమైన పువ్వులను ఇంతకు ముందెన్నడూ చూడలేదు. ఈ పూలు పూచే మొక్కలు మన ఉద్యాన వనంలో కూడా లేవు!" అన్నది.

అవును అన్నట్టు రాజు తలపంకించాడు.

కొంతసేపటికి బహుమతీ ప్రదానోత్సవం ముగిసింది. అప్పుడు రాజు ప్రజల నుద్దేశించి ఇలా అన్నాడు: "ప్రియమైన ప్రజలారా! ఈ యేడు వసంతోత్సవాలను ఇంత ఘనంగా నిర్వహించినందుకు నాకెంతో ఆనందంగా ఉన్నది. ముఖ్యంగా మీరు నిర్వహించిన క్రీడా పోటీలు ప్రశం సించ తగ్గవి. వాటిలో పాల్గొన్న కొండజాతి యువకులు ప్రదర్శించిన నేర్పు, వాళ్ళ నాయకుడు ఉత్తుంగుడుచూపిన నైపుణ్యం కొనియాడ తగినవి. అందుకే ఈ సంవ త్సరం ప్రారంభించిన నూతన క్రీడకు ఆ కొండజాతి ప్రజలు నివసించే శృంగ్మాయ్ ప్రాంతం పేరు మీదగా 'మాయ్‌క్రీడ' అని

నామకరణం చేస్తున్నాను. అంతే కాదు, ఈ సంవత్సరం నుంచి మన సైన్యంలో ఈ కొండజాతి యువకులకు కూడా స్థానం కల్పిస్తున్నాను. రేపు వసంతోత్సవం ఆఖరి రోజు గనక, ప్రతియేడులాగా రేపు కూడా రాజప్రాసాదం తలుపులు తెరిచే ఉంటాయి. మీరు ఎవరు రావాలన్నా నిరభ్యంతరంగా రాజప్రాసాదానికి రావచ్చు. రాజకుటుంబంతో హాయిగా కలిసి మెలిసి తిరగవచ్చు. లైరంబీమాత మనల్ని రక్షించుగాక!"



ఆ మాటలు విని అక్కడ చేరిన వేలాది ప్రజలు చేసిన, "రాజు ప్రతాపవర్మ వర్థిల్లాలి! యువరాణి ప్రియంవద వర్థిల్లాలి!" అన్న నినాదాలు మిన్నుముట్టాయి.

రాజూ, యువరాణీ వేరు వేరు రథాలలో రాజప్రాసాదానికి బయలుదేరారు. రాజు రథంలో, ఆయనతోపాటు సేనానాయకుడు గంభీరసింహుడు, యువరాణి రథంలో ఆమె వెంట ఇద్దరు చెలికత్తెలూ ఉన్నారు. నగర ప్రధాన వీధులలో రథాలు వెళుతూ ఉంటే వీధికి ఇరువైపులా ప్రజలు బారులు తీరి నిలబడి చేతులు జోడించి వారికి శుభాకాంక్షలు తెలియజేశారు.

రాజప్రాసాదాన్ని చేరగానే, యువరాణి ప్రియంవద చెలికత్తెల చేత, పూలగుచ్చాలను అమర్చే పెద్ద తొట్టెను తీసుకురమ్మని, ఉత్తుంగుడు ఇచ్చిన పుష్పాలను తీసి అందులో స్వయంగా అమర్చింది. అందమైన ఆ పుష్పాలకు, అక్కడ చేరగానే మరింత అందం రావడం చూసి యువరాణి ఆనందంతో పొంగిపోయింది.

మరునాడు తెల్లవారగానే నగరం నాలుగు వైపుల నుంచీ ప్రజలు రాజప్రాసాదంకేసి తండోపతండాలుగా రాసాగారు. రాజు, యువరాణి, రాజబంధువులు మరికొందరు మేడ మీద నిలబడి చేతులు ఊపుతూ ప్రజల శుభాకాంక్షలు స్వీకరించారు.

యువతీ యువకులు ఒకరిమీద ఒకరు రంగు రంగుల నీళ్లూ, పొడులూ చల్లుకుంటూ, ఆనందంతో పాటలు పాడుతూ, నృత్యం చేస్తూ ఆరోజంతా సంతోషంగా గడిపారు.



"చిత్తం, మహారాజా!"అని అక్కడి నుంచి వెళ్ళిన సేనాధిపతి గంభీరసింహుడు, కొంత సేపటికి దృఢకాయులైన ఇద్దరు సైనికులను వెంట బెట్టుకుని వచ్చాడు. వారికి అతడు యువరాణి భవనంలో ఉన్న పువ్వులను చూపి రాజు కోరికను తెలియ జేశాడు.

ఆ పువ్వులను చూసి సైనికులు కూడా ఎంతో సంతోషించారు. "ఈ పువ్వులు చాలా అందమైనవి. వాటిని గుర్తించడం చాలా సులభం," అని వాళ్ళు సేనాధిపతితో చెప్పి, యువరాణికేసి తిరిగి, "మీరు కోరిన ఈ పూలమొక్కలతో తిరిగి వస్తాము. మాకు సెలవివ్వండి, యువరాణీ!" అని నమస్కరించి, అక్కడి నుంచి వెళ్ళిపోయారు.

సాయంకాలానికి ఉత్సవాల హడావుడి తగ్గిన తరవాత, రాజు, సేనాధిపతిని పిలిచి, "మొన్న శృంగ్మాయ్ కొండల ప్రాంతం నుంచి వచ్చిన ఉత్తుంగుడు, యువరాణికి ఇచ్చిన పుష్పాలను నువ్వు చూశావు కదా! ఆ పూల మొక్కలను మన ఉద్యానవనంలో నాటించాలని ప్రియంవద కోరుతున్నది. కాబట్టి మన సైన్యంలోని ఇద్దరు సమర్థులైన యువకులను శృంగ్మాయ్ కొండలకు పంపి, ఆ పూలమొక్కలను తెచ్చే ఏర్పాటు చెయ్యి. అక్కడ వాళ్ళకు ఉత్తుంగుడు సాయపడ గలడు. అక్కడికి వెళ్ళే వారిని మొదట ఆ యువకుణ్ణి చూడమని చెప్పు," అన్నాడు.

సైనికులు శృంగ్మాయ్ కొండలకు వెళ్ళి ఒకవారం రోజులు గడిచి పోయింది. కాని వాళ్ళ జాడలేదు. వాళ్ళు ఇంకా ఎందుకు తిరిగి రాలేదా అని యువరాణి ఆలోచిస్తూన్న కొద్దీ ఆమెలో ఓర్పు నశించ సాగింది. అయితే ఉత్తంగుడు ఇచ్చిన పువ్వులు, పదిరోజులయినా ఇంకా ఏ మాత్రం వాడకుండా అప్పుడే పూచినట్టున్నాయి. యువరాణికి అది కాస్త ఉపశమనం కలిగించ సాగింది.

ఇలా మూడు వారాలు గడిచాక పూల మొక్కల కోసం వెళ్ళిన ఇద్దరు సైనికులు మరిన్ని పువ్వులతో రాజధానికి తిరిగి వచ్చారు. సేనాధిపతి గంభీరసింహుడు

వారిద్దరినీ వెంటబెట్టుకుని రాజప్రాసాదానికి వెళ్ళాడు. అక్కడ రాజూ, యువరాణీ, వాళ్ళ రాకకోసం ఎదురు చూస్తున్నారు. గంభీరసింహుడు వాళ్ళు తెచ్చిన పువ్వులను యువరాణికి ఇచ్చి, రాజుతో, "శృంగ్మాయ్ కొండలలో వీళ్ళకు ప్రస్తుతం ఈ పువ్వులు మాత్రమే లభించాయట. మొక్కలు లభ్యం కాలేదట!" అన్నాడు.



ఎందుకు అన్నట్టు రాజు ఆ సైనికులకేసి చూశాడు. అప్పుడు వాళ్ళలో ఒకడు, "మహాప్రభూ! తమ అజ్ఞానుసారం మేము వారం రోజులు ప్రయాణం చేసి అతికష్టం మీద శృంగ్మాయ్ కొండలను చేరుకున్నాము. ఉత్తుంగుణ్ణి కలుసుకున్నాము. ఆ యువకుడు మమ్మల్ని చూసి ఎంతో సంతోషించాడు. మమ్మల్ని వెంట బెట్టుకుని అక్కడికి చాలా దూరంలో ఉన్న కొండల మీదికి తీసుకు వెళ్ళాడు. ఆ కొండల మధ్య చిన్న చిన్న పొదలుగా వెదుళ్ళలాంటి మొక్కలు ఆకాశాన్నంటుతూ ఉన్నాయి. ఆ చెట్ల చిటారు కొమ్మలలో మెరుపుల్లా మెరుస్తూ ఈ పువ్వులు కనిపించాయి. అక్కడి వాళ్ళు వాటిని మెరుపుపూలనీ, వంద సంవత్సరాలకు ఒకసారి పూయడం వల్ల 'శతాబ్దిక' అనీ పిలుస్తారట. వాళ్ళు కూడా వాటిని ఇప్పుడే మొట్టమొదట చూశారట. పూవులు పూచిన రెండేళ్ళ తరవాత వీటి మొక్కలు అక్కడక్కడ గుంపులు గుంపులుగా, పుట్టుకొస్తాయనీ, అవి పెరిగి పెద్దవై పూయడానికి వంద సంవత్సరాలు పడుతుందనీ, అక్కడి పెద్దలు చెప్పారు. యువరాణికి ఆశాభంగం కలగకూడదని ఒక చెట్టును నరికించి, వాటి పూలను తెచ్చాము, ప్రభూ!" అన్నాడు.

సైనికుడి మాటలను శ్రద్ధగా ఆలకించిన రాజు, "చాలా వింతగా ఉన్నది. సరే మరొక రెండేళ్ళలో వాటి మొక్కలు మొలిచేప్పుడు వాటిని తెచ్చి, ఉద్యానవనంలో నాటిద్దాం," అన్నాడు.

"ఆ మొక్కలు పూయడానికి ఇంకా నూరేళ్ళు పడుతుందా? అలా అయితే ఆ మొక్కలు పూయడం చూసే అదృష్టం నాకు

లేదన్నమాట!" అన్నది యువరాణి ఎంతో నిరుత్సాహంగా.

రాజు సైనికులతో, "ఇంత శ్రమపడి ఆ పూలను తెచ్చినందుకు మీకు ధన్య వాదాలు!" అని, సేనాధిపతి వైపు తిరిగి, "వీరిని ఉచిత రీతిలో సత్కరించి పంపు," అన్నాడు.

"చిత్తం, మహారాజా!"అని అక్కడి నుంచి బయలుదేరాడు సేనాధిపతి. సైనికులు ఆయన వెంట నడిచారు.

సైనికులు శృంగ్మాయ్ కొండలకు వెళ్ళి, అక్కడ శతాబ్దిక గురించి సేకరించుకుని వచ్చిన విషయాలు, క్రమంగా ప్రజల మధ్య వ్యాపించాయి. అది ఆ నోటా ఆ నోటా పడి, వయోవృద్ధుడైన రాజగురువు గౌరీనాధుడి చెవిలో పడింది. 'శతాబ్దిక' అన్నమాట విన గానే అతడు ఉలిక్కి పడ్డాడు. రాజగురువు విద్యాధికుడు. రాజకుటుంబం యోగ క్షేమాల పట్ల ఎంతో శ్రద్ధగలవాడు. వెంటనే అతడు తన వద్ద ఉన్న తాళపత్ర గ్రంథా లన్నిటినీ తిరగ వేశాడు. ఒక నిర్ణయానికి వచ్చి, తాను వస్తున్నట్టు రాజుగారికి ఒక భటుడి ద్వారా కబురు పంపాడు.

రాజగురువు వస్తున్నాడన్న వార్త వినగానే, రాజు ఈ అపరాత్రి వేళ ఆయన రావడానికి కారణం ఏమై ఉంటుందా అని ఆలోచిస్తూ, ఆయన రాకకోసం ఎదురు చూడసాగాడు. రాజగురువు రాజప్రాసాదంలో అడుగు పెట్టగానే, రాజు ఎదురు వెళ్ళి ఆయనకు పాదాభివందనం చేసి, గౌరవంగా లోపలికి తీసుకువెళ్ళాడు. ఆయన ఉచితాసనంలో కూర్చున్న తరవాత రాజు, "గురుదేవా! తమ రాకకు కారణం..." అనగానే, "ముఖ్యమైనదే, మహారాజా!" అన్నాడు రాజగురువు.

ఏమిటి అన్నట్టు చూశాడు రాజు.

"శతాబ్దిక గురించి విన్నాను. ఆ పువ్వు పూయడం రాజకుటుంబానికీ, రాజ్యానికీ అశుభాన్ని సూచిస్తుంది, మహారాజా!" అన్నాడు రాజగురువు.

"అశుభాన్ని సూచిస్తుందా?" అన్నాడు రాజు విస్మయంతో తన చెవులను తానే నమ్మలేనట్టు.

—(ఇంకావుంది)






# అదనపు అర్హత

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, కొందరు వ్యక్తులు ఎంతో పట్టుదలా, శ్రమలకోర్చి కూడా సాధించ దలచిన కార్యం సాధించలేక విసిగి పోయి, గొప్ప వివేకంతో చేస్తున్నామను కుంటూ, అవివేకమైన నిర్ణయాలు చేసి, ఆత్మవంచనకు పాల్పడతారు. ఇందుకు ఉదాహరణగా, విశాలవర్మ అనే రాజు, తన కుమారుడి వివాహం విషయంలో చేసిన నిర్ణయాన్ని గురించి చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్ప సాగాడు:

పూర్వం వైశాలినీదేశాన్ని, విశాలవర్మ అనే మహారాజు పాలిస్తూండేవాడు. ఆయనకు ఒక చెల్లెలు వుండేది. ఆమె, వివాహమైన

## బేతాళ కథలు



కొద్దికాలానికే ఒక కుమార్తెను కని, చని పోయింది. చెల్లెలి పట్ల అపరిమితమైన వాత్సల్యం గల విశాలవర్మ, బావగారి అనుమతి తీసుకుని, చెల్లెలి బిడ్డను తనే పెంచసాగాడు. ఆ బాలికకు వైశాలి అని నామకరణంచేసినవిశాలవర్మ,ఆమెను తన ఏకైకపుత్రుడు విజయవర్మతో సమానంగా ఆదరిస్తూ, వారిద్దరికీ వివాహంచేసి, చెల్లెలి ఆత్మకు శాంతి చేకూర్చాలన్న ఆలోచనను కూడా పెంపొందించుకోసాగాడు.

ఇలారోజులుగడిచి, వైశాలి, విజయవర్మ ఇద్దరూ యుక్తవయస్కులయ్యారు. ఎప్పటి కప్పుడు వాళ్ళ ప్రవర్తనను పరిశీలిస్తూ వస్తున్న విశాలవర్మ, కొడుకు మేనకోడలి పట్లఎటువంటి ప్రత్యేకాభిమానమూ చూపక పోవడం గమనించి, అతడు వైశాలిని వివాహమాడేందుకు తిరస్కరిస్తాడేమోనని ఆందోళన పడసాగాడు. చివరకు ఆందోళన భరించలేని విశాలవర్మ, కొడుకును ఏకాంతంగా కలుసుకుని, తన మనసులోని మాట బైట పెట్టాడు.

విజయవర్మ ఆ మాటవిని కొంతసేపు మౌనంగా ఉండి, సంకోచం గానే, "వైశాలి అనుకూలవతి అయిన సహధర్మచారిణి కాగలదు కాని, భావి మహారాజుకు తగిన మహారాణి కాగల అర్హత మాత్రం ఆమెకు లేదని నా అభిప్రాయం!" అన్నాడు.

కొడుకు మాటలతో తీవ్రమైన ఆశాభంగా నికి గురైన విశాలవర్మ, ఆగ్రహంతోకూడిన వెటకారంతో, "ఓహోఁ, అనుకూలత గాక, మహారాణికి అదనపు అర్హతలుండాలన్న మాట! సరే, ఆ అర్హతలేమైనా వుంటే– అవి వైశాలికికాక మరెవరికున్నట్టు?" అని ప్రశ్నిం చాడు.

విజయవర్మ ఒక్క క్షణం తటపటా యించి, చివరకు, "నాతో బాటు విద్యా భ్యాసం చేసిన, మన మహాసేనాధిపతి కుమార్తె సౌమిత్రి పూర్తిగా అర్హురాలని నా విశ్వాసం," అన్నాడు.

ఆ జవాబుతో విశాలవర్మ మనసు ఒక్క క్షణం భగ్గుమన్నది. ఆయన కోపంగా, "ఏమిటి, సౌమిత్రి, వైశాలికంటే అధిక

రాలా? దేనిలో అధికురాలు? అంద చందాలలోనా? సౌశీల్యంలోనా? ఏమిటా అదనపుఅర్హత?" అని అడిగాడు.

విజయవర్మ శాంతంగా, "మన్నించండి నాన్నగారూ! ఆగ్రహంలో వున్న మీకు, నా మాటలు కటువుగా ధ్వనిస్తాయి," అన్నాడు.

ఈ జవాబు వింటూనే విశాలవర్మ అక్కడి నుంచి లేచి పోయాడు. తర్వాత ఆయన కొడుకు దగ్గిర, ఈ ప్రస్తావన ఒకటి, రెండు సార్లు తెచ్చాడు. అయితే, విజయవర్మ, తండ్రికి తను పూర్వం ఇచ్చిన జవాబే ఇచ్చాడు.

దీనితో విసిగిపోయిన రాజు విశాలవర్మ, "నీ మొండి పట్టుదల విడవవన్న మాట? నీ వివాహం ఇంత గడ్డు సమస్యగా పరిణమిస్తుందని నేనేనాడూ ఊహించ లేదు," అన్నాడు.

తండ్రి మానసికంగా ఎంత ఆందోళన చెందుతున్నదీ గ్రహించిన విజయవర్మ, ఆయనతో, "అయితే, నాన్నగారూ, ఈ గడ్డు సమస్యను పరిష్కరించే మార్గం గురించి నేనాలోచించాను. ఒక పనిచెయ్యండి. నేను మీకొక కథ చెబుతాను. కథ చివరిలో కొన్ని ప్రశ్నలు వేస్తాను. వాటికి మీరు జవాబు చెప్పనవసరం లేదు. వైశాలిని, సౌమిత్రిని దగ్గర కూర్చోబెట్టి, ఆ కథ వారికి చెప్పి, అవే ప్రశ్నలు వారినడగండి. వాళ్ళు వాటికిచ్చే సమాధానాల్లోనే, మీకు కావలసిన జవాబు



వుంటుంది!" అని తను చెప్పదలుచుకున్న కథ విశాలవర్మకు చెప్పాడు.

విశాలవర్మ అయిష్టంగానే కథంతా విని, మర్నాడు అంతఃపురంలో వైశాలీ, సౌమిత్రీ వీణావాదనలో నిమగ్నమైవుండగా,అక్కడికి పోయి ఇద్దరినీ పలకరించి, ఆ మాటా ఈ మాటా మాట్లాడి కొద్దిసేపు గడవ నిచ్చి, తర్వాత, "మీ ఇద్దరికీ నేనొక చక్కని కథ చెబుతాను. శ్రద్ధగా వినండి!" అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం అవంతీదేశాన్నిపాలించిన సింహకేతుడికి ఇద్దరు భార్యలు. వంశాచారం ప్రకారంతల్లిదండ్రులునిర్ణయించినస్వర్ణలత అతడి పెద్దభార్య కాగా, చిన్నభార్య శ్రీలేఖ



గుణగణాలూ, వ్యక్తిత్వమూ విని, అతడు కోరి ఆమెను వివాహం చేసుకున్నాడు.

పెద్దభార్య స్వర్ణలత, రాను రాను రాజు తనకంటే శ్రీలేఖనే ఎక్కువ అభిమానిస్తున్నాడన్న అనుమానంతో కృంగిపోసాగింది. దానికి తగినట్టే శ్రీలేఖ తరుచు పురుషవేషం ధరించి, రాచకార్యాల్లోనూ, మృగయా వినోదంలోనూ కూడా భర్తకు చేదోడు వాదోడుగా వుండేది.

ఇదంతా చూస్తున్న స్వర్ణలత, తాను కూడా పురుష వేషం ధరించి, భర్తతోపాటు తిరగాలని నిర్ణయించుకున్నది.

భార్య నిర్ణయం విన్న సింహకేతుడు, ఆమెకేసి ఆశ్చర్యంగా చూసి ఏదో చెప్పబోయాడు. కాని, స్వర్ణలత, భర్తకు మాట్లాడే అవకాశం ఇవ్వకుండా, "శ్రీలేఖలాగే నేను కూడా గుర్రపుస్వారీ, కత్తియుద్ధంలాంటివి నేర్చుకున్నదాన్నే, ప్రభూ!" అన్నది.

ఆ మాటలు విన్న సింహకేతుడు చిన్నగా నవ్వుకుని, "సరే, అలాగే కానీ, దేవీ!" అన్నాడు.

తర్వాత వారం తిరక్కుండానే, స్వర్ణలత పురుషవేషం ధరించి భర్త వెంట అడవికి వేటకు వెళ్ళింది. అడవిలో చెల్లాచెదురుగా గిరిజనుల పర్ణ కుటీరాలున్నవి. వేటలో డస్సిపోయిన రాజు సింహకేతుడు, రాణిని వెంటబెట్టుకుని, దగ్గరలో వున్న ఒక కుటీరానికి వెళ్ళాడు. ఆ సమయాన ఇంట ఒక స్త్రీ మాత్రం వున్నది.

ఆమె , రాజదంపతులను సాదరంగా ఆహ్వానించి, లోపలి నుంచి రెండు మట్టి పాత్రలనిండా ఏదో పదార్థం తీసుకువచ్చి, వారికి ఇస్తూ, "మా గిరిజనుల ఇళ్ళల్లో, ఇది ప్రత్యేకంగా వండుతాము, దొరా!" అంటూ సంబరంగా చెప్పింది.

సింహకేతుడు చిరునవ్వుతో, ఆమె దగ్గర నుంచి పాత్ర తీసుకుని తినసాగాడు. స్వర్ణలత కూడా పాత్ర తీసుకుని, లోపలవున్న పదార్థం కొద్దిగా తీసి నోట పెట్టుకున్నది. వెంటనే ఆమెకు వాంతి అయినంత పని అయింది. భర్త మాత్రం ఆప్యాయంగా తింటున్నాడు.

రాజు పూర్తిగా తినడం అయ్యాక, గిరిజన స్త్రీతో, "చాలా బాగుందమ్మా! అలాగే, మీ అడవి తేనె కూడా వుంటే కాస్త ఇస్తావా?" అని అడిగాడు.

ఆ స్త్రీ ఆనందంగా తలవూపి, రెండు చిన్న పాత్రల నిండుగా తేనె తీసుకువచ్చి, రాజదంపతులకు ఇచ్చింది. వాళ్ళు తేనె తాగి, విశ్రాంతి తీసుకుని, అక్కడి నుంచి బయలుదేరారు. వారిని సాగనంపడం కోసం, గిరిజన స్త్రీ కూడా బైటికి వచ్చింది.

బయలుదేరబోయే క్షణాన స్వర్ణలత భర్తతో, "ప్రభూ! ఒక్క క్షణం," అని గిరిజన స్త్రీని లోపలికి తీసుకువెళ్ళి, తమకు ఇచ్చిన పదార్థాన్ని తయారుచేసే విధానం అడిగి తెలుసుకున్నది.

ఒక వారం రోజులు గడిచిన తర్వాత, ఒకనాడు స్వర్ణలత అంతఃపురానికి వెళ్ళిన సింహకేతుడికి, స్వర్ణలత స్వయంగా ఒక బంగారుపాత్ర నిండా ఏదో పదార్థం తెచ్చి ఇస్తూ, "ఆనాడు అడవిలో గిరిజనుల ఇంట మీరు ఇష్టంగా తిన్న వంటకం ప్రభూ!" అన్నది.

ఇందుకు సింహకేతుడు చిన్నగా నవ్వి, పాత్రను పక్కనే వున్న బల్లమీద పెట్టి, తన మెడలోని ముత్యాలపతకం తీసి ఆమె మెడలో వేస్తూ, "నీకు నా పట్లవున్న శ్రద్ధకూ, అభిమానానికీ నాకు చాలా ఆనందంగా వుంది దేవీ! ఇటువంటి నువ్వు, కోమలమైన శిరీష పుష్పంలా అంతఃపురంలో వుండడమే తప్ప, ఆరుబయట నాతోబాటు





కష్టపడడం నాకిష్టంలేదు,"అన్నాడు చిన్నగా నవ్వుతూ.

భర్త మాటలకు ఆనందించాలో, బాధ పడాలో అర్థం కాక, మౌనంగా వుండి పోయింది స్వర్ణలత.

కథ పూర్తిచేసిన విశాలవర్మ, వైశాలి, సౌమిత్రిల వైపు కొంతసేపు మార్చి మార్చి చూస్తూ, "అమ్మా, నాకొక సందేహం! రాజు సింహకేతుడి ప్రవర్తన, అతడు తన ఇద్దరు భార్యలయిన స్వర్ణలతా శ్రీలేఖల మధ్య తేడా చూపిస్తున్నాడన్న విషయాన్ని స్పష్టపరుస్తూనే వున్నది. అయితే, అతడి ప్రవర్తన అక్రమమైనదా? సక్రమమైనదా?" అని ప్రశ్నించాడు.

వైశాలి వెంటనే, "సింహకేతుడి ప్రవర్తన స్వర్ణలత పట్ల అక్రమమైనదనడంలో, ఏ మాత్రం సందేహం లేదు. భార్యలిద్దరూ సమానవిద్యగలవారైనా, అతడు శ్రీలేఖను తనతో తీసుకువెళుతూ, స్వర్ణలతను అంతః పురంలోనే వుండమని చెప్పడంలోనే, అతడి అక్రమ ప్రవర్తన స్పష్టమవుతున్నది," అన్నది.

రాజు విశాలవర్మ తల పంకించి, సౌమిత్రి వైపు తిరిగి, "ఏం తల్లీ! నీ సమాధానంకూడా అదేనా?" అని ప్రశ్నించాడు.

సౌమిత్రి చిరునవ్వుతో కాదన్నట్టుగా తల వూపి, "సింహకేతుడి ప్రవర్తన సక్రమమైనదే కాక, రాజకీయదక్షతకూ, మానవతా విలువలకూ పట్టం కడుతున్నది ప్రభూ!" అన్నది చిన్నగా నవ్వుతూ.

ఈ జవాబు విని, ఒక క్షణం నివ్వెర పోయిన విశాలవర్మ, మౌనంగా తలవంచుకుని కొద్దిసేపు తీవ్రంగా ఆలోచిస్తూ వుండి పోయి, చప్పున లేచి అక్కడి నుంచి వెళ్ళి పోయాడు.

ఆ తర్వాత నెలతిరక్కుండానే ఆయన, సౌమిత్రితో విజయవర్మకు అత్యంత వైభంగా వివాహం జరిపి, రాజ్యభారాన్ని అతడికి అప్పగించాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, తన ప్రశ్నకు వైశాలి జవాబు కన్న, సౌమిత్రి ఇచ్చిన జవాబు విశాలవర్మను ఏ కారణంవల్ల

సంతృప్తి పరిచిందో అర్థం కావడం లేదు. సమానమైన విద్యాసౌశీల్యాలు గల ఇద్దరు భార్యల్లో, సింహకేతుడు, శ్రీలేఖపట్ల ఎక్కువ ఆదరాభిమానాలు చూపడం అక్రమ ప్రవర్తనే అవుతుందిగదా! అలాంటప్పుడు రాజు విశాలవర్మ, సౌమిత్రి జవాబును మెచ్చుకుని, ఆమెను తన కొడుకుకు కట్టబెట్టడం వివేకహీనం అనిపించుకోదా? కొడుకు ఎలాగూ వైశాలిని వివాహమాడడన్న నమ్మకంతో, సౌమిత్రి జవాబుకు తృప్తిపడినట్టు నటించడం, విశాలవర్మ ఆత్మవంచన చేసుకోవడమే గదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పక పోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "సాధారణ వ్యక్తికీ ఒక దేశాన్ని పాలించే రాజుకూ ప్రవర్తన విషయంలో చాలాతేడా వుంటుంది. రాజైన వాడికి రాజ్యమంతా తన కుటుంబమే. కేవలం గిరిజన స్త్రీని సంతృప్తి పరచడం కోసమే సింహకేతుడు తనకు నచ్చని పదార్థాన్ని ఎంతో ఇష్టంగా తిన్నాడు. ఆ సంగతి స్వర్ణలత గ్రహించలేక పోయింది. అదే శ్రీలేఖ అయితే అతణ్ణి ఎంతగానో మెచ్చుకునేది. పైగా స్వర్ణలత గిరిజన స్త్రీ వండిన పదార్థంలాంటిదే వండించి, భర్తను తినమని కోరడం, ఆమె అమాయకత్వాన్ని చాటుతుంది. ఇలాంటివారు కేవలం అంతఃపురానికే పరిమితం కావడం, గ్రహింపు జ్ఞానంలాంటి అదనపుఅర్హత గల శ్రీలేఖ వంటి వారు, సర్వదా భర్తలకు చేరువగా వుండడం సహజమే. విశాలవర్మ చెప్పిన కథలో విజయవర్మ, సింహకేతుడైతే, సౌమిత్రి, శ్రీలేఖ. వైశాలీ, సౌమిత్రిల జవాబులు విన్నాక రాజు విశాలవర్మ ఈ సంగతి గ్రహించాడు. అందువల్లనే ఆయన తన కొడుకుకు సౌమిత్రితో వివాహం జరిపించాడు. ఇందులో ఆయన ఆత్మవంచన ప్రసక్తే లేదు!" అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. — (కల్పితం)

[ఆధారం : "శర్మిల" రచన]



# చందమామ కబుర్లు



ఇటీవల ముగ్గురు కుర్రవాళ్ళు వార్తలలోకి వచ్చారు. ముగ్గురూ అమెరికాకు చెందినవారే. ఆ ముగ్గురిలో పెద్దవాడు అమెరికాలో స్థిరపడిన భారతీయ సంతతివాడు.

## "ఆశాజ్యోతి"

జనవరి 20వ తేదీ నూతన అమెరికా అధ్యక్షుడుగా బిల్‌క్లింటన్ పదవీ బాధ్యతలు స్వీకరించిన సందర్భంగా ఏర్పాటు చేసిన విందుకు, యాభైమంది ప్రముఖులను ప్రత్యేకంగా అహ్వానించాడు. బిల్ క్లింటన్ చేత 'ఆశాజ్యోతి' అనిపించుకుని, అలా ప్రత్యేక ఆహ్వానం అందుకున్న వారిలో మన కేరళ ప్రాంతం నుంచి వెళ్ళి అమెరికాలో స్థిరపడిన డా॥ అప్పుకుట్టన్ అబ్బాయి రోజర్ కుట్టన్ ఒకడు. "ప్రెసిడెంట్ నుంచి ఆ ఆహ్వానం రాగానే, నేనూ, మా తండ్రీ, తల్లీ, చెల్లెలూ ఎంతో ఆనందించాము. మా అమ్మకయితే కొంతసేపు నోటమాట రాలేదు!" అన్నాడు పందొమ్మిదేళ్ళ రోజర్. అతడు విందులో పాల్గొని ఇంటికి రాగానే, "చరిత్రాత్మకమైన ఒక సంఘటనను చూడడమే కాదు! అందులో పాలుపంచుకోవడం నిజంగా చెప్పలేనంత ఆనందంగా ఉన్నది," అన్నాడు.

రోజర్ అసలుపేరు రాజ్. అతడు మూడేళ్ళ బాలుడుగా ఉన్నప్పుడే కారు నంబర్లు చూసి, వాటిని గుర్తు పట్టేవాడు. మరిచిపోయే వాడు కాదు. దానిని గమనించిన అతని తండ్రి అతన్ని హాప్కిన్స్ విశ్వవిద్యాలయానికి తీసుకువెళ్ళారు. అక్కడ ప్రవేశ పరీక్షలో 90% మార్కులతో ఉత్తీర్ణుడై తొమ్మిదవ యేట గణితశాస్త్రంలో పట్టభద్రుడయ్యాడు. ఆ తరవాత 'వాల్‌స్ట్రీట్'లోని కోటీశ్వరులు కొందరికి 'మనీ మేనేజర్' అయ్యాడు. ఇప్పుడతడు అమెరికా అధ్యక్షుడు బిల్ క్లింటన్ ఆర్థిక సలహాదారులలో ఒకడు!

## అమెరికా ప్రభుత్వానికి విరాళం!

అమెరికా లోని ఉత్తర డకోటా—ఫార్గోకు చెందిన ల్యారీ విల్లేలా అనే కుర్రవాడి వయసు 14 యేళ్ళు. అతడు మొక్కల వ్యాపారం చేసి, సంపాదించిన ఆదాయంలో అమెరికా ప్రభుత్వానికి 1,000 డాలర్లు విరాళంగా పంపాడు. అధ్యక్షుడు బిల్‌క్లింటన్ పదవీ స్వీకారం చేశాక, బడ్జెట్‌లోటును పరిచేయాలని ప్రజలకు విజ్ఞప్తి చేశాడు. దానికి తన వంతు బాధ్యతగా విరాళం పంపి ఆ మొత్తాన్ని విద్యకూ, 'ఎయిడ్స్' పరిశోధనకూ ఉపయోగించాలని ల్యారీ కోరాడు.



## అతి పిన్నవయసు ప్రచురణకర్త!

అమెరికాలో 'లేట్‌నైట్' టీవీ కార్యక్రమాలను నిర్వహించే డేవిడ్ లెటర్‌మన్— గ్లెన్ ఎల్లిన్‌కు చెందిన బ్లేక్ ప్లాంకీ అనే పదేళ్ళ కుర్రాణ్ణి ఇటీవల ప్రత్యేకంగా ఇంటర్వ్యూ చేశాడు. నాలగవ తరగతి చదువు తున్న ఈ కుర్రాడు 'అవుట్ ఆఫ్ ది వరల్డ్' అనే వార్తాపత్రికను నాలుగేళ్ళనుంచి నడుపుతున్నాడు. ప్రపంచ వ్యాప్తంగా చందాదారులున్న ఆ పత్రికకు, ఇంటర్వ్యూ చేసిన డేవిడ్ కూడా ఒక చందాదారుడే!

# చందమామ
# అనుబంధం - 54

మనదేశపు పక్షులు—జంతువులు :

## చిరుతపులులు

శరీరం మీది మచ్చలనుబట్టి చిరుతపులులను ముఖ్యంగా రెండు రకాలుగా విడదీయవచ్చు. ఒక రకం చిరుతపులులకు శరీరం మీద గుండ్రటి చిన్న చిన్న మచ్చలుంటాయి. రెండవ రకం చిరుతపులులకు శరీరంమీద పెద్ద పెద్ద మచ్చలూ, ముఖంమీదా, మెడమీదా చారలూ తోకమీద ఉంగరాల చారలూ వుంటాయి. పులులలాగే ఇవి కూడా పిల్లిజాతికి చెందినవే. ఇవి పులుల కన్నా చిన్నవి (200–215 సెం.మీ.). మామూలుగా పసుపుపచ్చ రంగులో ఉంటాయి. నల్లచిరుత పులులు మరీ అరుదుగా కనిపిస్తాయి. మనదేశంలో పులులు నశించిపోతున్నాయే తప్ప, చిరుత పులులకు ఇంకా ఆ స్థితి రాలేదు. అవి దేశమంతటా ఉన్నాయి. అప్పుడప్పుడు కొన్ని గ్రామాల మీదపడుతూ ఉంటాయి.

హిమాలయ పర్వత ప్రాంతంలోని చిరుతపులులలో రెండు రకాలు ఉన్నాయి. తూర్పు హిమాలయ పర్వత సానువులలో బూడిద రంగు చిరుతపులులూ, మంచు కప్పిన కొండల ప్రాంతంలో మంచు పులులూ ఉంటున్నాయి. ఈ మంచు పులులు చాలా అందమైనవి. నల్లటి మచ్చలతో, గచ్చకాయ రంగులో ఉన్న వీటి చర్మాలకు మంచి గిరాకీ ఉన్నది. కాబట్టి వీటిని ఎక్కువగా వేటాడుతూ ఉంటారు. హిమాలయ ప్రాంతంలోని ఈ పులులు మామూలు చిరుతపులుల కన్నా చిన్నవి (100–110 సెం.మీ.).

మామూలుగా పులులకు చెట్లెక్కడం చేతకాదు. చిరుతపులులు మాత్రం చక్కగా చెట్ల మీదికి ఎక్కగలవు.





# మన సమకాలీన సాహిత్యం

ఆకాశంలో చుక్కలు తప్ప ఏమీ కనిపించని చిమ్మచీకటి కమ్ముకున్న అమావాస్య అర్ధరాత్రి సమయంలో ఒంటరిగా నడుస్తూన్న ఒక బాటసారికి దొంగల ముఠా ఒకటి ఎదురు పడింది. దొంగల మాటలను బట్టి వాళ్ళు పక్క గ్రామాన్ని కొల్లగొట్టడానికి వస్తున్నారని ఆ బాటసారి గ్రహించాడు. దొంగల నాయకుడు తమవైపు ఎవరో రావడం చూసి, "ఆగు అక్కడే! అడుగు ముందుకు వేశావో ప్రాణాలు దక్కవు!" అని హెచ్చరించాడు.

"చావుకు భయపడేవాణ్ణి కాను నేను. నిన్ను చూడడానికే వస్తున్నాను!" అన్నాడా వ్యక్తి.

## జావర్ చంద్ మెఘానీ 'మన్‌సై-న-దివ'

"నన్ను చూడడానికా! నాతో నీకేం పని? అసలు నువ్వెవరు?" అని అడిగాడు దొంగల నాయకుడు.

"నేను దేశభక్తుణ్ణి. మాతృభూమి మీద అధికారం చెలాయిస్తున్న విదేశీయుల దుర్మార్గాన్ని ఎదిరించి దేశ స్వాతంత్ర్యంకోసం పోరాడుతున్నవాణ్ణి!" అన్నాడావ్యక్తి.

"ఒక విధంగా మేమూ నీలాంటి వాళ్ళమే. దుర్మార్గులయిన ధనికుల ఇళ్ళల్లో బందీగా ఉంటూన్న లక్ష్మీదేవికి స్వతంత్రం ఇవ్వడానికి పాటుపడుతున్నాము. మేము ఎంత దూరంలో ఉన్నా సంపన్నుల ఇళ్ళల్లో బాధపడుతున్న లక్ష్మీదేవి ఆర్తనాదం మా చెవులకు వినిపిస్తుంది!" అన్నాడు దొంగ హేళనగా.

"మీరు దోచుకుంటున్నది ధనికులను మాత్రమేనా? అమాయకులయిన పేద ప్రజలను హింసించడం లేదా?" అని ప్రశ్నించాడావ్యక్తి.

"లేదు. అమాయకుల జోలికి పోము, వారిని వేధించం," అన్నాడు దొంగ.

"అలాగా! అయితే, మీ పేరు వినగానే పేద ప్రజలు గాలిలోని ఆకుల్లా అల్లాడిపోతారెందుకు? మీరు వస్తారని తెలియగానే హడలెత్తి గొడ్డూగోదను వదిలిపెట్టి, పిల్లాజల్లతో అడవులలోకి పారిపోతున్నారే అది ఎందుకు? మీరు వచ్చి వెళ్ళాక పోలీసులు వచ్చి పెట్టే నానాబాధలు భరించలేక వాళ్ళు గజ గజ వణికిపోతారన్న సంగతి మీకు తెలియదా? వాళ్ళు సక్రమంగా వ్యవసాయం చేసుకోలేకపోతున్నారు. మరి ఇవన్నీ వేధించడం కాదా?" అని ప్రశ్నల వర్షం కురిపించాడావ్యక్తి.

ఆ ప్రశ్నలకు దొంగల నాయకుడు సరైన సమాధానం చెప్పలేకపోయాడు. దొంగలు మౌనంగా వెనక్కు తిరిగి వెళ్ళారు.

ఆ వ్యక్తి పక్క గ్రామానికి తిరిగి వెళ్ళి, దొంగలు వస్తున్న సంగతి చెప్పాడు. ప్రజలు భయపడిపోయి దాపులనున్న అడవిలోకి వెళ్ళి దాక్కున్నారు. అయినప్పటికీ దొంగలు మాత్రం రానే లేదు!

దొంగల మనసులలో సైతం మార్పు తీసుకు వచ్చిన ఆ మహనీయుడు గుజరాత్‌కు చెందిన సుప్రసిద్ధ సంఘ సంస్కర్త రవిశంకర్ మహరాజ్!

1927వ సం।। ప్రాంతంలో రవిశంకర్ మహరాజ్‌ను గురించి ప్రజలు గొప్పగా చెప్పుకునేవాళ్ళు. బాధలలో ఉన్న సామాన్య పేద ప్రజలను ఆయన ఆదుకునేవాడు. ఆయనకు అద్భుతశక్తులు ఉండేవని కూడా సామాన్య ప్రజలు విశ్వసించేవారు. అందుకే దుర్మార్గులయిన మనుషులే కాకుండా దుష్ట జంతువులు కూడా ఆయన చెప్పినట్టు వింటాయని చెప్పుకునేవారు. ఇతరుల



దృష్టిలో దుర్మార్గులయిన వారిని కూడా చేరదీసి, మంచి మార్గానికి మళ్ళించే అద్భుతశక్తి ఆయనకు ఉండేది. కర్కశ హృదయులైన నేరస్థులను కూడా సానుభూతితో అర్థం చేసుకోవడానికీ, వారికి మంచిమార్గం చూపడానికీ మహరాజ్ ప్రయత్నించాడు.

వంద సంవత్సరాలకు పైగా జీవించి, ఇటీవల కీర్తిశేషులైన రవిశంకర్ మహరాజ్ జీవిత చరిత్ర గుజరాతీ భాషలో 'మన్‌సై-న-దివ' (మట్టిదీపం) పేరుతో వెలువడింది. అద్భుత రసప్రధానమైన నవలలాగా సాగే ఈ జీవితచరిత్రను సుప్రసిద్ధ గుజరాతీ రచయిత జావర్ చంద్ మెఘానీ (1897 - 1947) రచించాడు. ఆయన ఇంకా చాలా నవలలూ, నాటకాలూ, కథానికలూ,కవితలూ రచించాడు.

# మీకు తెలుసా?

1. తాజ్‌మహల్‌ను అనుకుని ప్రవహిస్తున్న నది ఏది?
2. లోక్‌సభకు ఎక్కువ సభ్యులను పంపే రాష్ట్రం ఏది?
3. శాంతి ప్రేమలకు చిహ్నంగా ఏ పక్షిని చెబుతారు?
4. ప్రపంచంలోకెల్లా అతి పెద్ద జంతువు ఏది?
5. 'కూచిపూడి నాట్యం' ఏ రాష్ట్రం నుంచి వచ్చింది?
6. 'కారకోరం మార్గం' రెండు దేశాలను కలుపుతుంది. అవి ఏవి?
7. చైనా రాజధాని 'బీజింగ్'. మరి ఆ దేశంలో అతి పెద్ద నగరం ఏదో తెలుసా?
8. ఆధునిక భవనాలలో ఉపయోగించే 'లిఫ్ట్'లను ఎవరు కనుగొన్నారు?
9. వెండి అత్యధికంగా లభించే దేశం ఏది?
10. నోబెల్ శాంతి బహుమతి పొందిన అమెరికాకు చెందిన నీగ్రో నాయకుడు ఎవరు?
11. 'ఈఫిల్ టవర్' ఎక్కడ ఉన్నది?
12. టర్కీలోని 'ఇస్తాన్‌బుల్' నగరం ప్రాచీన నామం ఏది?
13. మనదేశానికి స్వాతంత్ర్యం ఇవ్వడానికి ఇంగ్లాండు అంగీకరించినప్పుడు, అక్కడి ప్రధానమంత్రి ఎవరు?
14. 'రేఖాగణితపిత'గా ఎవరిని చెబుతారు?
15. దక్షిణ అమెరికాలోని చిలీలో ఏ భాష మాట్లాడతారు?
16. తెల్లటి జాతీయ పతాకం గల దేశం ఏది?
17. 'ఆధునిక బ్యాంకింగ్' విధానం ఎక్కడ ఆరంభమయింది?
18. తలుపులకు తాళం వేసి, తాళంచెవులను ఉపయోగించే పద్ధతిని మొట్టమొదట కనుగొన్నవారెవరు?

## సమాధానాలు

1. యమున
2. ఉత్తరప్రదేశ్
3. పావురం
4. నీలి తిమింగలం
5. ఆంధ్రప్రదేశ్
6. పాకిస్తాన్-చైనా
7. షాంగాయ్
8. ఎలీషా ఓటిస్
9. మెక్సికో
10. మార్టిన్ లూథర్ కింగ్
11. ప్యారిస్
12. కాన్‌స్టాంటినోపిల్
13. క్లెమెంట్ అట్లీ
14. యూక్లిడ్
15. స్పానిష్
16. పశ్చిమ సహారా
17. ఇటలీ
18. ఈజిప్టు దేశస్థులు




# పొగరుబోతు సిద్ధయ్య

చాలాకాలం క్రితం రాజన్నపేట అనే గ్రామంలో, సిద్ధయ్య అనే ఒక పొగరుబోతు వాడుండేవాడు. వాడెంతపొగరుబోతంటే— కోపంవస్తే, ఆఖరుకు ఆత్మబంధువులలాటి వారినైనా నానా తిట్లూ తిడుతూ కొట్టేందుకు వెళ్ళేవాడు. వాడిఈదుష్ప్రవర్తనకు అలవాటు పడిన గ్రామస్థులు వాడంటేదూరంగా వుండే వాళ్ళు.

ఒకసారి వాడి పొలంలో చంద్రన్న అనే వాడి గేదె పడి మేయసాగింది. సిద్ధయ్య దాన్ని కర్రతో బాది, చంద్రన్న ఇంటికి పోయి, "ఒరేయ్, చంద్రన్నా! నీ గేదె నా చేలో పడి సర్వనాశనం చేసింది. ఇప్పుడు నా ఆవులన్నిటినీ నీ పంటపొలంలోకి తోలబో తున్నాను," అన్నాడు రౌద్రంగా.

వాడి కోపం ఎరిగిన చంద్రన్న శాంతంగా, "అదేదో నోరులేని గేదె, పైగా నీ పొలంలో ఏ పంటా లేదాయె. ఏదో పచ్చిగడ్డి మేసి ఉంటుంది. ఈసారికి క్షమించు, సిద్ధయ్యా!" అన్నాడు.

అయినా, సిద్ధయ్య శాంతపడక, "దానికి నోరు లేదు, నువ్వు నోరున్న చవటవి. జరిగిందానికి శిక్షగా, నువ్వు వారం రోజుల పాటు దాని పాలు మా ఇంట ఇచ్చి పోవాలి. లేదా, నా ఆవులు పచ్చగా వున్న నీ పంట పొలంలో పడి మేయడం ఖాయం," అన్నాడు.

చంద్రన్న చేసేదిలేక, వారం రోజుల పాటు గేదె పాలను సిద్ధయ్యకు ఇచ్చు కున్నాడు.

ఇంకొకసారి, ఆ ఊరి వర్తకుడు పొర బాటునసిద్ధయ్యకొన్న బెల్లంతూకం తక్కువ తూచాడు. సిద్ధయ్య ఇంటికి వెళ్ళి జరిగింది గ్రహించి, గావుకేకలు పెడుతూ వర్తకుడి దుకాణానికి వచ్చి, "నేనంటే ఈ ఊళ్ళోనే కాదు, ఈ పరగణా అంతకూ హడలు.

జె. ఉదయనాగశిరీష



అలాంటి నాకే దొంగ తూకాలు తూస్తావా?" అన్నాడు.

వర్తకుడు ఎంతో మర్యాదగా, "అయ్యా, సిద్ధయ్యా! పొరబాటనేది ఎవరికైనా సహజం. నేను కావాలని నీకు తక్కువ తూయలేదు. ఒక వేళ నేను మోసకారి ననుకుంటే, నా దగ్గిర సరుకు కొనడం మానెయ్యండి. అలా రంకెలేస్తూ, నోటికి వచ్చినట్టల్లా తిట్టకండి," అన్నాడు.

"నాకు నీతులుచెపుతావా? సరే,చూస్తా నీ సంగతి!" అంటూ వేగంగా వెళ్ళిపోయాడు సిద్ధయ్య.

ఆ రాత్రి వర్తకుడు తవుడు బస్తాలు దాచుకున్న పాక అంటుకు పోయింది. అది సిద్ధయ్య చేసినపనే అని వర్తకుడితో పాటు, ఊళ్ళోఅందరికీ తెలిసినా, వాడి పొగరుబోతు తనానికి భయపడి ఎవరూ నోరెత్తలేదు.

ఇలా వుండగా, ఆ ఊరుకు ఎక్కడి నుంచో ఒక సన్యాసి వచ్చాడు. వారం తిర క్కుండానే ఆ సన్యాసి గొప్ప మహిమలు కలవాడని, ఊళ్ళో అందరికీ నమ్మకం కుదిరింది. ఆ కారణంగా,ఆయనను వాళ్ళు రోజుకొకరింట భిక్షకు ఆహ్వానించసాగారు.

ఇది చూసిన సిద్ధయ్య, భార్యతో, "ఊళ్ళో ఒక పూట తిండి గడవని వెధవలందరూ, ఆ సన్యాసికి ఘనంగా భోజనాలు పెడు తున్నారు. నేనో—ఊరూ, పరగణా అంతకూ పేరు మోసినవాణ్ణి! నేను ఆ సన్యాసిని ఈ మధ్యాన్నం మనింటికి భోజనానికి పిలుస్తు న్నాను. నువ్వు మరవక, నీకు తెలిసిన పిండి వంటలన్నీ తయారు చెయ్యి," అని చెప్పాడు.

ఆ వెంటనే సిద్ధయ్య, సన్యాసి దగ్గిరకు వెళ్ళి, "నేనంటే ఊళ్ళో అందరికీ తగని భయం. ఆ సంగతి ఈ సరికి నీకు తెలిసే వుంటుంది. ఈ మధ్యాన్నం, నా ఇంటికి భోజనానికి రా," అన్నాడు.

అక్కడున్న వాళ్ళలో ఒకళ్ళిద్దరు ధైర్యం చేసి, "ఆ చెప్పేదేదో కాస్త మర్యాదగా చెప్ప రాదా, సిద్ధయ్యా!" అన్నారు.

అయితే సన్యాసి వాళ్ళతో, "అందరూ నా దృష్టిలో సమానులు. నాకు ఎలా పిలిచా

రన్నది ముఖ్యం కాదు. నన్ను పిలిచిన వారింటికి తప్పకుండా భిక్షకు వెళతాను," అన్నాడు.

"ఆహాఁ, ఈ మతిమాలిన వెధవలకు బాగా చెప్పావు!" అని సిద్ధయ్య, సన్యాసిని మెచ్చుకుని, "నాకు ఏ పనైనా అనుకున్న వేళకుజరిగిపోవలసిందే.అందువల్ల, సరిగ్గా పన్నెండు గంటలకు, మా ఇంటికి రావాలి," అని చెప్పి వెళ్ళిపోయాడు.



సిద్ధయ్య చెప్పిన వేళకు సన్యాసి బయలు దేరబోతూండగా, పాము కరిచిన వ్యక్తి నొకణ్ణి అతడి బంధువులు మోసుకువచ్చి, ఆయన పాదాల ముందు పడవేసి మంత్రం వెయ్యమన్నారు.

సన్యాసి వాళ్ళతో, "మంచి మనసుతో అందరికీ శుభం కోరుకోవడమే మంత్రం!" అని, సంచీలోంచి విభూతితీసి పాముకాటు తిన్నవాడి నుదుట పెట్టాడు. కొంతసేపటికి వాడు నిద్ర నుంచి లేచినవాడిలా లేచి కూర్చున్నాడు.

ఇది ముగిసి సన్యాసి, సిద్ధయ్య ఇంటికి చేరుకునేసరికి పన్నెండు దాటింది. సిద్ధయ్య ఆయనకేసి పళ్ళుకొరుకుతూ చూసి, "నాకు, ఏ పనైనా అనుకున్న వేళకు జరిగి పోవల సిందే అని ముందే హెచ్చరించాను. నేను పన్నెండు గంటలకు భోజనం చేసేశాను. ఇప్పుడుపన్నెండున్నర.ఇకవెళ్ళు," అన్నాడు.

"అతిథి నారాయణుడితో సమానం. భోజనానికి పిలిచిన అతిథి రాకుండా భోజనం చేయడంగృహస్థుచేయకూడనిపని. జరిగిందేదో జరిగింది. అతిథిని పొమ్మని మరింత పాపం కట్టుకోకు,"అన్నాడు సన్యాసి.

ఇది విని రెచ్చిపోయిన సిద్ధయ్య, "నాకే నీతులు చెబుతావా?" అంటూ సన్యాసి చెంప మీద గట్టిగా కొట్టాడు.

ఇది చూసిన వాళ్ళు కోపం పట్టలేక, మూక ఉమ్మడిగా పోయి సిద్ధయ్యను కొట్ట బోయారు. అయితే, సన్యాసి వాళ్ళను ఆగమని, "మనిషికి పొగరుబోతుతనం ఉండకూడదు. ఇతడికి ఆ భగవంతుడే బుద్ధి చెబుతాడు. నా మీది గౌరవంతో అతణ్ణి వదిలెయ్యండి," అన్నాడు.

సరిగ్గా సన్యాసిని కొట్టిన ఆరునెలలకు, సిద్ధయ్య కుడి అరచేతిలో చిన్న పొక్కులేచి క్రమంగా పెద్దదై భరించలేనంత బాధగా తయారైంది. పరీక్షించిన వైద్యులు అది రాచపుండని తేల్చారు.

సిద్ధయ్య ఎన్ని వైద్యాలు చేయించినా పుండు మానలేదు. చివరకు వైద్యులు శస్త్రచికిత్స చేసి, చెయ్యి తీసెయ్యక పోతే, మరెన్నాళ్ళో బతకవని సిద్ధయ్యకు చెప్పారు.

ఇప్పుడు సిద్ధయ్యలో చావు భయం కొద్దీ కాస్త పశ్చాత్తాపం రేకెత్తింది. సన్యాసిని కొట్టి నందువల్లే, తనకీ దుర్గతి ప్రాప్తించిందని వాడు గ్రహించాడు. అయితే, ఇంతకాలంగా ఊరంతనూ హడలెత్తించిన తను, శస్త్ర చికిత్స చేయించుకుని మొండిచేత్తో తిరుగు తుంటే, అందరూ హేళన చేస్తారని, వాడికి బాధ కలిగింది.

ఈ స్థితిలో, సన్యాసి మరొకసారి, ఆ ఊరు వచ్చి సిద్ధయ్యను గురించి వాకబు చేశాడు. వాడి దీనస్థితి తెలుసుకుని, ఒంటరిగా వాణ్ణిచూడబోయి,ఎంతో జాలిగా, దయగా, "సిద్ధయ్యా, ఎలా వున్నావు?" అని అడిగాడు.

సిద్ధయ్య ఒక్కసారి భోరుమని, "స్వామీ, ఇలా వున్నాను! మీరో, దేవుడో నన్ను కఠినంగా శిక్షించారు," అంటూ సన్యాసి పాదాల మీద పడ్డాడు.

సన్యాసి వాణ్ణి లేవనెత్తి, "నాయనా, నీలో పశ్చాత్తాపం కలిగినందుకు చాలా సంతో షంగా వుంది. ఎవరో కాదు, నీ పొగరు బోతుతనమే నిన్ను శిక్షించింది! ఏదీ, ఆ చెయ్యి చాచు," అని వాడి చేతిలో ఇంత విభూతి చల్లాడు.

మరుక్షణం వాడి అరచేతిలో వున్న రాచ పుండు మటుమాయమైంది. సన్యాసి మారు మాట్లాడకుండా అక్కడి నుంచి బయలు దేరి ఎటో వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత, సిద్ధయ్య పూర్తిగా మారి పోయాడు. క్రమంగా ఆ ఊరిలోనే కాక, చుట్టుపట్ల కూడా, వాడివంటి సౌమ్యుడూ, దయాగుణం కలవాడూ లేడని పేరు తెచ్చు కున్నాడు.






# నిర్భయురాలు

పూర్వం టర్కీ దేశంలో, అమీర్ అనే పేదవాడుండే వాడు. కొంతకాలం క్రితం అతడి భార్య చనిపోయింది. అతడికి సల్మా అనే కూతురున్నది. ఎదిగి పెళ్ళీడు కొచ్చిన సల్మాని చూసి, వృద్ధాప్యంలో పడ్డ అమీర్ చాలా విచార పడుతూండే వాడు. జీవిత మంతా కష్టపడి కూడా అతడు ఎర్రని ఏగాణీ వెనకేయలేక పోయాడు. ఈ పరిస్థితిలో కూతురి పెళ్ళి చేయడం ఎలా? ఇదీ అతడి విచారానికి కారణం.

సల్మాకు చిన్నప్పటి నుంచీ దయ్యాలు - భూతాలు గురించిన కథలు వినడం మహా సరదా. అలా విని విని ఆమె భయం అంటే ఏమిటో తెలియని దానిలా మారిపోయింది.

ఒకసారి అమీర్ ఇంట్లో చిన్న విందు జరిగింది. ఆ రాత్రి విందుకు అమీర్ బాల్యస్నేహితుడు అహమ్మద్ కూడా వచ్చాడు. ఆయన తోళ్ళ వ్యాపారంలో బాగా సంపాదించాడు. విందు అర్ధరాత్రి వరకూ సాగింది. ఇంతలో దుకాణం నుంచి కొని తెచ్చిన తేనెరొట్టెలు అయిపోయాయి. అహమ్మద్ ఇంకా కావాలని అడగడంతో అమీర్, కూతురు సల్మాను పిలిచి, "అమ్మా! నువ్వు వెళ్ళి దాదా దుకాణం నుంచి నాలుగు తేనెరొట్టెలు తీసుకురా," అన్నాడు.

అహమ్మద్ ఇదివిని ఆశ్చర్యపోతూ, "దాదా దుకాణం శ్మశానం ఆవల వుంది. ఈ అర్ధరాత్రి సమయంలో శ్మశానంలో నుంచి వెళ్ళడానికి సల్మాకు భయం వేయదా?" అని అడిగాడు.

"ఉహు! సల్మా ప్రపంచంలో దేనికీ భయపడదు," అన్నాడు అమీర్ సగర్వంగా.

సల్మా, దాదా దుకాణం నుంచి తేనెరొట్టెలు తీసుకొచ్చింది. అప్పుడు అహమ్మద్, అమీర్‌తో, "రేపు అమావాస్య. రేపు అర్ధరాత్రి నీ కూతురు శ్మశానంలోకి వెళ్ళి,

టర్కీ జానపద కథ



అక్కడ నుంచి ఒక కపాలం తీసుకురా గలదా?" అని అడిగాడు.

"ఒకటేం ఖర్మ! అక్కడ దొరికిన కపాలా లన్నీ తెమ్మన్నా తెస్తుంది. ఏం, పందెం కాస్తావా? వంద బంగారుకాసులు!" అన్నాడు అమీర్ నవ్వుతూ.

పందానికి అంగీకరించాడు, అహమ్మద్. తెల్లవారాక అతడు ఖాన్ అనే ముసలివాడికి డబ్బాశ చూపించి, ఆ రాత్రి శ్మశానంలో ఏం చేయాలో వాడికి చెప్పి, అర్ధరాత్రి అవుతూనే అమీర్ ఇంటికి వచ్చి, సల్మాతో శ్మశానానికి పోయి కపాలం ఒకటి తెమ్మన్నాడు.

సల్మా, తండ్రి అమీర్ అనుమతి తీసుకుని, శ్మశానానికివెళ్ళింది. అక్కడ అహమ్మద్ వేసిన పథకం ప్రకారం, ఒక గోరీ వెనక గొయ్యిలో ముసలి ఖాన్ రహస్యంగా దాక్కున్నాడు.

సల్మా చీకట్లో వెదికి ఒక కపాలం తీసుకున్నది. వెంటనే ఖాన్ కీచుగొంతుతో, "ఏయ్, పిల్లా! ఆ కపాలం, మా అమ్మది. దాన్ని ముట్టుకోకు," అన్నాడు.

సల్మా దాన్ని వదిలేసి మరొక కపాలాన్ని తీసుకున్నది. ఖాన్ గోరీ వెనక గొయ్యిలోంచి మరింత కీచుగొంతుతో, "ఏయ్, అది మా నాన్న కపాలం! ముట్టకు," అన్నాడు.

ఇది విని సల్మా కపాలాన్ని కింద పడ వేసి, కోపంగా గోరీ వెనక్కు వెళ్ళింది. ఆ చీకట్లో గొయ్యిలో దాగివున్న ఖాన్ బట్టతల, ఆమెకు కపాలంలా కనిపించింది. అయితే, అది అటూ ఇటూ ఊగుతూండడం, ఆమె గమనించింది.

సల్మా గట్టిగా పళ్ళు కొరుకుతూ, "ఒరే, బట్టతల సైతాన్, ఇక నోర్మూయ్యి! మళ్ళీ నోరెత్తావో బండరాయితో చితక్కొట్టి, నీ కపాలాన్నే తీసుకుపోతాను," అంటూ ఖాన్ తల మీద నాలుగైదు సార్లు బలంగా తన్నింది.

ఆ దెబ్బలతో ఖాన్ దిమ్మ తిరిగి గోతిలోనే స్పృహ కోల్పోయాడు. సల్మా అక్కడ దొరికిన మరొక కపాలాన్ని తీసుకొని ఇంటికి తిరిగొచ్చింది. ఓడిపోయిన అహమ్మద్, పందెం ప్రకారం అమీర్‌కు వంద బంగారు కాసు లిచ్చుకున్నాడు.

ఆనాటి నుంచీ నిర్భయానికి మారు పేరుగా, సల్మాను ఆ గ్రామంలో చెప్పుకో సాగారు.

సల్మా వుండే గ్రామానికి పక్కన వున్న ఒక గ్రామంలో, సులేమాన్ అనే ఒక ధన వంతుడైన యువకుడుండేవాడు. అతడు ధనికుడే కాక మంచి అందగాడు. అయినా, అతడికి పిల్లనివ్వడానికి ఎవరూ ముందుకు రాలేదు. అంతేకాక, అతడి ఇంట్లో పనికి కుదిరిన నౌకర్లు, వారం తిరక్కుండానే పారిపోయేవాళ్ళు. ఇందుక్కారణం, చని పోయిన అతడి తల్లి భూతరూపంలో, ఇంట తిరుగుతూండడం.

సల్మా ధైర్యసాహసాల గురించి విన్న సులేమాన్, ఆమెకు పెద్ద జీతం ఆశ చూపి తన ఇంట్లోపనికి కుదుర్చుకున్నాడు. సల్మా, సులేమాన్‌కు భోజనం వడ్డించినప్పుడల్లా, పక్కన మరొక పళ్ళెంలో కూడా భోజనం వడ్డించి, సులేమాన్ తల్లి భూతంతో, "పెద్దమ్మా! కూరలూ అవీ బావున్నవి. తృప్తిగా తిను," అంటూ మంచి మాటలతో భూతం ఆదరణను సంపాయించుకున్నది.

ఒకనాడు సులేమాన్ వ్యాపారం పనిమీద పట్నం వెళ్ళాడు. రాత్రివేళ సల్మా ఇంటి పనులు చేసుకుంటూండగా, తల్లి భూతం ఆమెకు కనిపించి, "ఏమే, అమ్మాయ్! నన్ను చూస్తే నీకు భయం కలగడంలేదా?" అని అడిగింది.



సల్మా తాపీగా, "భయమా? నాకేనాడూ భయంఅంటే ఏమిటో తెలియదు, పెద్దమ్మా. పైగా మీరు చాలా మంచివారు," అన్నది.

ఆ జవాబుకు తల్లి భూతం చిన్నగా నవ్వు కుని, "నీ నిర్భీతీ, అందచందాలూ నాకు తృప్తి కలిగించినై. అయితే, వీటికి తోడుగా, ఎంతో సంపన్నుడైన నా కొడుకు ఇంటి యజమానురాలుగా మంచి తెలివితేటలు కూడా కావాలి. అవి నీలో ఏ పాటివున్నవో నాకు తెలియడంలేదు," అన్నది.

ఆ మాటలకు సల్మా తలవంచుకుని ముసిముసిగా నవ్వుకున్నది.

తల్లిభూతం ఒక క్షణం ఆగి, "ఈ ఇంటి దిగువున ఒక నేలమాళిగ వున్నది. ఆ

అర్ధరాత్రి చీకట్లో నువ్వు నా వెంట అక్కడికి రాగలవా?" అని అడిగింది. "అదెంత పెద్ద పని, పెద్దమ్మా!" అన్నది సల్మా తొణక్కుండా.

తల్లిభూతం ముందుండి దారి తీసింది. సల్మా, భూతంనుంచి వచ్చే వెలుగులో దాని వెనకనే నడవసాగింది. భూతం, ఆమెను ఒక గదిలో వున్న మెట్ల మీది నుంచి కిందికి తీసుకుపోయింది. అక్కడ కొన్ని ఇటుక రాళ్ళు చిందరవందరగా పడి ఉన్నవి.

భూతం, సల్మాతో ఆ ఇటుకరాళ్ళను పక్కకులాగమన్నది. సల్మా అలాగే చేసింది. అక్కడ వున్న ఒక గుంటలో రెండు రాగి బిందెలున్నవి. అందులో ఒకటి పెద్దది, రెండవదిచిన్నది. రెండింటినిండా అంచుల వరకూబంగారుకాసులుమెరుస్తూకనిపించినై.

భూతం, ఆ బిందెలను సల్మాకు చూపుతూ, "సల్మా, నువ్వు అన్ని విధాలా నాకు నచ్చావు. ఇక ఈ ఇంట నా కొడుక్కు రక్షణగా నేనుండనవసరంలేదు. ఆ పెద్ద బిందె నా కొడుకుకివ్వు, చిన్న బిందె నువ్వు తీసుకో, సరేనా!" అంటూ మాయమైంది.

తెల్లవారి సులేమాన్ పట్నం నుంచి తిరిగి రాగానే సల్మా, అతడికి రాత్రి జరిగింది చెప్పి, "మీ అమ్మగారు బంగారు కాసులున్న పెద్ద బిందె నన్ను తీసుకుని, చిన్న బిందె మీకివ్వమన్నారు!" అన్నది.

ఆ మాటలు వింటూనే సులేమాన్, సల్మాను ఒకసారి నఖశిఖ పర్యంతం పరీక్షగా చూసి, "ఆహాఁ," అంటూ పెద్దగా నవ్వి, "సల్మా! వెయ్యి మాటలెందుకు? నేను నిన్ను పెళ్ళాడదలిచాను. అప్పుడు పెద్దా, చిన్న బిందెల నిండు బంగారమంతా మనదే అవుతుంది. ఏమంటావు?" అన్నాడు.

సల్మా సిగ్గుతో తలపక్కకు తిప్పుకుని, ఏ జవాబూ చెప్పకుండా తన ఇంటికి వెళ్ళి, తండ్రి అమీర్‌తో జరిగినదంతా చెప్పింది. అతడు కూతురు అదృష్టానికి పరమా నందం చెందాడు.

ఆ తర్వాత వారం తిరక్కుండానే, చుట్టు పక్కల నూరుగ్రామాల్లో అందరి కన్నా సంప న్నుడైన సులేమాన్‌తో, భయమంటే ఎరగని సల్మా వివాహం వైభవంగా జరిగిపోయింది.






రాముడు రథంమీదనిలబడితనపైకి బాణ ప్రయోగం ప్రారంభించేసరికి, రావణుడు కోపంతో ఉగ్రుడై పోయి, రాముడి మీద గాంధర్వాస్త్రాన్ని వేశాడు. అయితే దివ్యాస్త్రాల ప్రభావం క్షుణ్ణంగా ఎరిగి వున్న రాముడు గాంధర్వాస్త్రాన్ని, గాంధర్వాస్త్రంతోనూ, తర వాత రావణుడు ప్రయోగించిన దైవాస్త్రాన్ని, దైవాస్త్రంతోనూ క్షణంలో తునాతునియలు చేశాడు.

ఈసారి రావణుడు, రాముడి మీద మహా భయంకరమైన రాక్షసాస్త్రాన్ని ప్రయోగిం చాడు. ఆ అస్త్రం నుంచి వెలువడిన అనేక విషసర్పాలు, తమ నోళ్ళ వెంట మంటలు కక్కుతూ, రాముడికేసి రాసాగినై. రాముడు వెంటనే వాటిపైకి గరుడాస్త్రాన్ని ప్రయోగిం చాడు. దానిలోనుంచి వెలువడిన గరుడ పక్షులు, రావణుడు ప్రయోగించిన విష సర్పాలను తమ నోళ్ళతో పట్టి సంహ రించినై.

రావణుడు ఇది చూసి మరింత కోపో ద్రిక్తుడై, రాముడి మీద బాణవర్షం కురిపిం చాడు. ఒక శక్తివంతమైన బాణంతో రాముడెక్కివున్న రథపు ధ్వజస్తంభాన్ని పడ గొట్టాడు. మరికొన్ని బాణాలతో రథాశ్వా లను నొప్పించాడు. ఆకాశంలో వుండి అతిదారుణమైన ఈ రామరావణ యుద్ధాన్ని చూస్తున్నదేవతలు, గంధర్వులు, యక్షులు, కిన్నరులు, కింపురుషులు, చారణులు-- పరమదుష్టుడైన రావణుడు, రాముణ్ణి తన బాణాలతో బాధించటమేగాక, దేవేంద్రుడి



రథపు ధ్వజాన్ని కూలవేసినందుకు చాలా విచారపడ్డారు.

విభీషణుడితో పాటు వానరులందరూ యుద్ధంలో రావణుడిది పైచెయ్యి కావటం చూసి కలత చెందారు.

రాముణ్ణి సంహరించటానికి ఇదే మంచి అదననిభావించిన రావణుడు, ఇంద్రుడి వజ్రాయుధంతో సమానమైన ఒక శూలాన్ని చేతికి తీసుకున్నాడు. అది దట్టమైన నల్లటి పొగలు చిమ్ముతూ, ఎర్రని మంటలు కక్కుతూ మహాభయంకరంగా ఉన్నది.

రావణుడు ఆ జ్వలిస్తున్న శూలాన్ని ఎత్తి పట్టుకుని రాముడితో, "ఓ, రాముడా! ఇదుగో, నీ పాలిటి మృత్యువు! ఈ క్షణం లోనే నిన్నూ, నీ తమ్ముణ్ణీ చంపి, నా తోబుట్టువూ, కుమారులతో పాటు మహా శూరులైన రాక్షసవీరులనువధించినందుకు నీ మీద పగతీర్చుకోబోతున్నాను," అంటూ రాముడికేసి విసిరాడు.

రావణుడు అలావిసిరిన శూలం నాలుగు వైపులా జ్వాలలతోనూ, మెరుపులతోనూ ప్రళయ భయంకరంగా గర్జిస్తూ, రాముడి కేసి వేగంగా రాసాగింది. రాముడు దానికేసి ప్రయోగించిన బాణాలన్నీ, దాన్ని తాకి భస్మమైపోయి, బూడిద గాలిలోకి లేచింది. రాముడు ఆ సరికి రావణుడు వదిలిన మహాస్త్రం ఎంత శక్తివంతమైనదో గ్రహించి, ఇంద్రుడు తన రథంతోపాటు పంపిన మహాశక్తిని దాని మీద ప్రయోగించాడు. అది తాకగానే రావణుడు ప్రయోగించిన శూలం రెండుగా విరిగి, నేలకూలింది.

ఆ వెంటనే రాముడు విజృంభించి, రావణుడి మీద వివిధాస్త్రాలు ప్రయోగించ సాగాడు. తాను వేసిన మహాశక్తి ఈ విధంగా నిష్ప్రయోజనం అవటం చూసి, రావణుడు దిగులుపడ్డాడు. ఇప్పుడు రాముడు వేసే బాణాల నుంచి ఆత్మరక్షణ కూడా చేసుకో లేని స్థితికి దిగజారాడు. అది గమనించిన రావణుడి రథసారథి, రథాన్ని యుద్ధరంగం నుంచి దూరంగా తోలుకుపోసాగాడు. రాక్షసులు భయకంపితులై హాహాకారాలు చేశారు.

తన రథం ఆ విధంగా యుద్ధభూమిని వదిలి కొంత దూరం పోగానే, రావణుడు తేరుకుని, రథ సారథిపై ఆగ్రహం చెంది, "ఓరీ, దుష్టుడా! నా అనుమతి లేకుండా రథాన్ని యుద్ధరంగం నుంచి ఎందుకు మళ్ళించావు? నేనేమైనా పిరికివాణ్ణీ, అసమర్థుణ్ణీ అనుకుంటున్నావా? అస్త్ర ప్రయోగం చేతకానివాణ్ణీ, యుద్ధంలో శౌర్యప్రతాపాలూ, అవసరమయితే యుక్తులూ ప్రదర్శించలేని చేతకాని వాణ్ణనుకుంటున్నావా? ఛీ, నాకు అవమానంకలిగించే ఈ మతిమాలిన పని ఎందుకుచేశావు? శత్రువుల నుంచి ఏమైనా ప్రతిఫలం పుచ్చుకున్నావా? వెంటనే రథాన్ని యుద్ధరంగం మధ్యకు నడుపు," అన్నాడు.



ఈ పరుష వాక్కులకు సారథి ముఖం చిన్నబుచ్చుకుని, రావణుడితో, "మహారాజా! నీ క్షేమం కోరిన వాణ్ణి గనకనే, రథాన్ని యుద్ధరంగం నుంచి దూరంగా నడిపాను. రాముడు చేసే అతి తీవ్రమైన యుద్ధానికి, నీవు తగిన విధంగా ప్రతియుద్ధం చేయటంలేదు. నీవు బాగా అలిసి ఉన్నావు. అంతేకాదు. రథాశ్వాలు కూడా బాగా డస్సి పోయి ఉన్నాయి. నీకూ, వాటికీ కొంత విశ్రాంతి అవసరం అని భావించి రథాన్ని ఇలా నడుపుకు వచ్చాను. అంతేకాని వేరొక ఉద్దేశం లేదు. యుద్ధరంగంలో రథాన్ని ఎప్పుడు ఎలా నడిపించాలో తెలియకపోతే, నేను సారథి నెలా అవుతాను? సరే జరిగి పోయిందేదో అయింది. ఇప్పుడేం చెయ్యమని ఆజ్ఞ?" అన్నాడు.

సారథి ఇలా అనగానే, రావణుడు అతడి రాజభక్తికీ, సమయస్ఫూర్తికీ మెచ్చి, అతడికి విలువైన ఒక హస్త కంకణాన్ని బహూకరించి, "రాముణ్ణి ఈ క్షణంలోనే, నా బాణ ఘాతానికి బలి చెయ్యబోతున్నాను. నేను అలిసి వున్నానని ఏ మాత్రం సంశయించక రథాన్ని వెంటనే అతడి కేసి తీసుకుపో," అన్నాడు.

సారథి రథాన్ని రాముడి ముందుకు తెచ్చి నిలిపాడు.

ఆ సమయంలో రాముడు బాగా అలిసి పోయి, రావణుడితో యుద్ధం చేసే శక్తిలేని



హాలతో విల్లంబులు చేతబట్టి, రావణుడితో యుద్ధం చేసేందుకు వేగంగా ముందుకు వచ్చాడు.

రాముడు రథసారథి అయిన మాతలితో, "మాతలీ! ఇప్పుడు రావణుణ్ణి నిశ్చయంగా చంపబోతున్నాను. నువ్వు రథాన్ని ఎంతో ఒడుపుగా, చాకచక్యంతో నడపవలసి వుంటుంది. దేవేంద్రుడి రథసారథివయిన నీకు ఇంతగా చెప్పవలసిన అవసరంలేదని నాకు తెలుసు. అయినా, నువ్వేమాత్రం ఏమరుపాటూ, అజాగ్రత్తా లేకుండా రథం నడపటం అవసరం అని, ఇలా హెచ్చరిస్తున్నాను," అన్నాడు.

మాతలి రథశ్వాలను గట్టిగా అదిలించి, రథం వేగంగా కదిలేటప్పుడు రేగినదుమ్ము, రావణుణ్ణి క్షణంలోచుట్టుముట్టేలా చేశాడు.

రావణుడు ఇది చూసి కోపోద్రిక్తుడై, రాముడి మీద బాణవర్షం కురిపించాడు.

రాముడు తనకు ఇంద్రుడు పంపిన విల్లూ, బాణాలూ తీసుకుని రావణుడితో యుద్ధానికి ఉపక్రమించాడు.

రామ, రావణుల మధ్య యుద్ధం అతి భయంకరంగా సాగింది. రెండు శత్రుపక్షాల వీరులూ యుద్ధం మాని, వాళ్ళ ద్వంద్వ యుద్ధాన్ని భయాశ్చర్యాలతో చూడసాగారు. రాముడూ, రావణుడూ కూడా ఇదే తమ అంతిమ పోరాటం అన్నంత తీవ్రంగా యుద్ధం చేశారు.

స్థితిలో ఉన్నాడు. రామ, రావణ యుద్ధం చూడ వచ్చిన దేవతలతో పాటు ఉన్న అగస్త్యమహర్షి అది గమనించాడు. ఆయన త్రికాలజ్ఞుడు. ఆయన రాముడి వద్దకు వచ్చి, "రామా, నీ అలసట పోయేందుకూ, తిరిగి నీలో యుద్ధోత్సాహం కలిగేందుకూ, నీకు ఆదిత్యహృదయం అనే స్తోత్రం చెబుతాను. అది సర్వ స్తోత్రాలలోనూ ఉత్తమమైనది. దానిని జపించి, తిరిగి శక్తివంతుడవై రావణునితో యుద్ధం చెయ్యి," అని రాముడికి ఆదిత్యహృదయం ఉపదేశించి, వెళ్ళిపోయాడు.

రాముడు ఆ స్తోత్రాన్ని మూడుసార్లు భక్తితో జపించి, ఇనుమడించిన బలోత్సా



ఇలా ఇద్దరి మధ్య కొద్దిసేపు యుద్ధం జరిగాక రాముడు ప్రయోగించిన అతి తీక్షణమైన బాణం దెబ్బకు, రావణుడి శిరస్సు తెగి నేలమీద పడింది. కాని, అదే క్షణంలో రావణుడికి మరొక శిరస్సు పుట్టుకొచ్చింది.

రాముడు మరొక వాడి బాణంతో ఆ శిరస్సును కూడా ఖండించాడు. అది నేల బడేలోపుగా రావణుడికి మరొక శిరస్సు మొలిచింది.

రాముడు ఈ విధంగా నూట ఒక్కసార్లు రావణుడి శిరస్సు ఖండించాడు. కాని ప్రతి సారీ రావణుడికి మరొక శిరస్సు మొలవటంతో, అతడు మరణించ లేదు.

ఇది చూసి రాముడికి చాలా ఆశ్చర్యం కలిగింది. లోగడ తాను దండకారణ్యంలో విరాధుణ్ణీ, క్రౌంచారణ్యంలో కబంధుణ్ణీ వధించేందుకు ఉపయోగించిన వాడి బాణాలు రావణుడిపట్ల ఎందుకు వృథా అవుతున్నవో అతడికి అర్థం కాలేదు.

రామ రావణులు ఈ విధంగా ఒక్క క్షణమైనా విశ్రాంతిలేకుండా ఏడు పగళ్ళూ,ఏడు రాత్రులూ యుద్ధంచేశారు. రాముడి బాణాలు రావణుడి మీద ఎందుకు వ్యర్థమవుతున్నవో మాతలికి తెలుసు. కారణం, రావణుడి మరణకాలం ఇంకా సమీపించలేదు.

ఎనిమిదవనాడు రావణుడి అంత్యకాలం సమీపించిందని తెలియగానే మాతలి, రాముడితో, "రామా, ఇదేమంచి సమయం. ఇక తాత్సారం చేయక, ఈ దుష్ట రావణుడి పైన బ్రహ్మాస్త్రం ప్రయోగించి, వధించు," అన్నాడు.

మాతలి ఇలా హెచ్చరించగానే రాముడు, భయంకర సర్పం లాంటి బాణాన్నొక దాన్ని చేతికి తీసుకున్నాడు. దేదీప్యమానంగా వెలిగిపోతున్న ఆ బాణాన్ని బ్రహ్మ ఒకప్పుడు ఇంద్రుడి కోసం సృష్టించాడు. అది చాలా బరువైనది. పెద్ద పెద్ద రెక్కలు గలది. వజ్రంలాగా అతి కఠినమైన ఆయుధాలను సహితం ఛేదించగలది.

రాముడు ఆ సర్వశక్తిమంతమైన మహాస్త్రాన్ని, వేదోక్తంగా మంత్రించి ఎక్కుపెట్టి,

రావణుడి పైన వేశాడు. అది రావణుడి రొమ్మును ఛేదించి, అతడి వీపులోంచి దూసుకుపోయి బయిటికి వచ్చింది.

రావణుడు తన చేతగల ధనుర్బాణాలను జారవిడిచి, ప్రాణాలు పోగా, రథం మీది నుంచి నేలమీద పడ్డాడు.

తమ రాజు మరణించటం చూస్తూనే రాక్షసులుగుండెలవిసి, హాహాకారాలు చేస్తూ లంకానగరంకేసి పారిపోసాగారు. వానరులు విజయ ధ్వానాలు చేస్తూ, పెకలించిన వృక్షాలూ, ఇతర ఆయుధాలూ పట్టుకుని, వాళ్ళను వెంటదగిలి, అందిన వారిని అందినట్టు చంపసాగారు.




రావణుడు చావగానే దేవదుందుభులు మోగాయి. ఆకాశం నుంచి పుష్పవర్షం కురిసింది. వానరులతోపాటు ఆకాశంలోని దేవతలూ, గంధర్వులూ, యక్షులూ, కిన్నరులూ,కింపురుషులూచారణులూ రాముణ్ణి గొప్పగా స్తుతించారు.

సుగ్రీవుడూ, అంగదుడూ చాలా ఆనందపడ్డారు. విభీషణుడూ, వానర ముఖ్యులూ రామలక్ష్మణులను ప్రశంసించారు.

విభీషణుడికి తన అన్న మరణం చాలా దుఃఖం కలిగించింది. ధర్మవిరుద్ధంగా సీతను అపహరించి తెచ్చినందుకు దుర్మరణం పాలయ్యాడే గాని, అతడు నిజంగా మహా పురుషుడని చెప్పదగినవాడు. గొప్ప తపశ్శాలి, పండితుడు, పరమ నిష్ఠాపరుడు, అసమాన శౌర్యపరాక్రమవంతుడు!

అన్న మరణించినందుకు ఇలా దుఃఖవివశుడైన విభీషణుణ్ణి, రాముడు ఓదార్చుతూ, "రావణుడు పిరికివాడిలా మరణించలేదు; వీరుడులాగా పోరాడుతూ యుద్ధరంగంలోమరణించాడు.ఎంత మహావీరుడైనా యుద్ధంలో శత్రువు చేత హతుడు కావచ్చు. వీరుడిలా మరణించి, వీరస్వర్గం చేరిన వాడి కోసం శోకించ కూడదు," అన్నాడు. రాముడు ఇలా చెప్పిన మీదట విభీషణుడికి కొంచెం ఓదార్పు కలిగింది.

తరవాత రాముడి అనుమతి తీసుకుని విభీషణుడు, తన అన్నకు శాస్త్రోక్తంగా

దహనక్రియలు జరిపేందుకు ఏర్పాట్లు చేయ సాగాడు.

రావణుడి మరణవార్త తెలియగానే అతని భార్యలు అంతఃపురం నుంచి బయలుదేరి, ఉత్తర ద్వారంగుండా యుద్ధభూమికి వచ్చి, అక్కడ రావణుడి శవాన్ని చూసి, దానిపైపడి గుండెలు అవిసేలా విలపించారు. విభీషణుడు చెప్పినట్టు సీతను, రాముడికి ఇచ్చి వున్నట్టయితే, ఈ విపత్తు సంభవించేది కాదని ఆక్రోశించారు.

"మూడు లోకాలనూ జయించి, దేవతలంతటి వారిచేత ఊడిగం చేయించుకున్న నీవు, చివరకు ఒక మానవ మాత్రుడి చేతిలో ప్రాణాలు కోల్పోయావా?" అంటూ హృదయవిదారకంగా మండోదరి విలపించింది.

రాముడు, విభీషణుణ్ణి దగ్గిరకు పిలిచి, "విభీషణా, ఇక్కడ శోకించే స్త్రీ లందరినీ వెంటనే అంతఃపురానికి పంపి, త్వరగా నీ అన్నకు ఉత్తరక్రియలు చెయ్యి," అని చెప్పాడు.

ఆఖరి క్షణంలో విభీషణుడికి ఒక ధర్మ సందేహం కలిగింది. తన అన్న ఇతరత్రా ఎంత ధర్మపరుడూ, మహాజ్ఞానీ అయినా, పరస్త్రీని చెరబట్టి తీసుకు రావటంతో, పరమనీచుడూ, దుష్టుడూ అయిపోయాడు. అలాంటి వాడికి తాను అగ్నిసంస్కారం లాంటి కర్మలు చేయటం ధర్మవిహితమైన కార్యం అవుతుందా?

ఈ సందేహన్ని విభీషణుడు రాముడికి వెల్లడించినప్పుడు రాముడు, రావణుడి ఇతర గుణగణాలను గొప్పగా ప్రశంసించి, "నీ అన్నకు నీ చేతి మీదుగా ఉత్తర క్రియలుజరపటం పూర్తిగా ధర్మసమ్మతం," అన్నాడు.

బ్రాహ్మణులు చందనపు చెక్కలతో చితి పేర్చి, దానిపైన ఒక గొంగళీ పరిచి, రావణుడి శవాన్ని అలంకరించి, దానిపైన పడుకోబెట్టారు. విభీషణుడు చితికి నిప్పు పెట్టాడు. తరవాత అతడు స్నానం చేసి, నీళ్ళు వదిలి, రావణుడి భార్యలను లంకకు పంపి, రాముడి దగ్గిరకు వచ్చాడు.





# ఇద్దరు మిత్రులు

ఆరుకొలను అనే గ్రామంలో వుండే ఇరవై ఏళ్ళ అప్పన్నకు చాలా విద్యలు తెలుసు. తండ్రి వాడికి కొంత డబ్బిచ్చి, "నువ్వు పట్నం వెళ్ళి నీ ప్రతిభతో బాగా డబ్బు సంపాదించి పేరుతెచ్చుకుని, తిరిగి రా," అని చెప్పాడు.

ఇందుకు అప్పన్న సరేనని బయల్దేరి, ఒక అడవిదారిలో ఆగి, ఒక చెట్టుకింద విశ్రాంతి తీసుకోసాగాడు.

ఆ సమయంలో అక్కడికి వాడి వయసు వాడే ఇంకొకడు వచ్చాడు. మాటల సందర్భంలో వాడిపేరు అబ్దుల్లా అనీ, తనకులాగే ఎన్నో విద్యలు తెలుసుననీ, తండ్రివాడిని తనకులాగే పట్నం పంపుతున్నాడనీ, అప్పన్నకు తెలిసింది.

పట్నంలో ఇద్దరూ కలిసే వుండాలనీ, ఎన్నడూవిడిపోగూడదనీ వాళ్ళు నిర్ణయించుకున్నారు. ఇద్దరూ ఒకరికొకరు అంతబాగా నచ్చారు!

వాళ్ళింకా ఏవో కబుర్లు చెప్పుకుంటూండగా, వాళ్ళనొక ఆటవికుల బృందం చుట్టుముట్టింది. వాళ్ళ నాయకుడు ముందుకు వచ్చి, "మేము నరబలికోసం వెతుకుతున్నాం. మీ ఇద్దరిలో ఒక్కరు చాలు మాకు. కాబట్టి మీ ఇద్దరూ మాట్లాడుకుని, ఎవరు మాతో వస్తారో నిర్ణయించుకోండి. లేదా మేము ఇద్దర్నీ తీసుకుపోతాం," అన్నాడు.

అప్పన్న, అబ్దుల్లా మాట్లాడుకున్నారు. ఇద్దరికీ దేవుడంటే ఎంతో భక్తి వుంది. ఇద్దరికీ మంచితనం మీద గట్టి నమ్మకముంది.

"ఇలాంటి ప్రమాద సమయంలో నిన్ను విడిచి వెళ్ళిపోతే, నా దేవుడు నన్ను క్షమించడు. అన్నింటికీ ఆయనపై భారం వేసి, నేను వీళ్ళ వెంట వెళ్ళిపోతాను. లేకుంటే ఇద్దరం ప్రమాదంలో చిక్కు కుంటాం," అన్నాడు అప్పన్న.

"వసుంధర"



"నేను స్వార్థపరుడినైతే, నా దేవుడు నన్ను క్షమించడు. నేనే వీళ్ళతో వెళతాను. నువ్వు పట్నం వెళ్ళు," అన్నాడు అబ్దుల్లా.

ఇలా ఎంతకూ వాళ్ళ వాదులాట తెగక పోయేసరికి, "ఏమిటి ఆలస్యం?" అంటూ ఆటవికనాయకుడు విసుక్కున్నాడు.

"నేను మీతో వస్తాను. అందుకు ఇతణ్ణి ఒప్పించు," అన్నాడు అబ్దుల్లా.

"నేనే మీతో వస్తాను. అందుకు ఇతణ్ణి ఒప్పించు," అన్నాడు అప్పన్న.

నాయకుడు ఆశ్చర్యపోయాడు. నరబలి కోసం వాళ్ళు పోటీలు పడతారని వాడను కోలేదు. వాడు సంతోషంగా, "మీ వంటి వాళ్ళు మాకు దొరకరు. వచ్చే పున్నమికి మీలో ఒకణ్ణి బలి ఇస్తాం. ఆ తర్వాత ఆర్నెల్లకు రెండోవాణ్ణి బలి ఇస్తాం. మా దేవత ఎంతో సంతోషించి మాకు మేలు చేస్తుంది," అంటూ వాళ్ళను తన నివాసానికి తీసుకువెళ్ళాడు.

"మనిషిని మనిషి బలిఇస్తే, దేవత సంతోషిస్తుందా?" అన్నాడు అబ్దుల్లా, ఆటవిక నాయకుడి నివాసానికి చేరుకున్నాక.

"అదివాళ్ళ అజ్ఞానం," అన్నాడు అప్పన్న.

మర్నాడు ఆటవికుల నాయకుడు తమ దగ్గరకు వచ్చినప్పుడు, వాళ్ళు వాడితో, "పున్నమికి ఇంకా పది రోజుల వ్యవధి వుంది. ఈలోగా మావల్ల మీరుఎన్నో ప్రయోజనాలు పొందవచ్చు. మీకు తెలియని విషయలెన్నో మాకు తెలుసు. అవన్నీ నేర్చుకోండి," అన్నారు.

నాయకుడు ఒప్పుకున్నాడు.

ముందుగా వాళ్ళు ఆటవికులకు నాగరికుల పద్ధతిలో వంటలు చేయడం నేర్పారు. రెండు రోజుల్లోనే ఆటవికులు ఆ రుచికిపరమానందంచెంది, "ఇంతకాలంగా తిండి తింటున్నాం కానీ, ఇలాంటి తిండి తినలేదు," అన్నారు.

అప్పన్న, అబ్దుల్లా వాళ్ళకు పురాణాల లోంచి రకరకాల నీతి కథలు చెప్పారు. అన్ని కథలూ కూడా మనిషిలో మంచిని పెంచి, స్వార్థాన్ని నశింపచేయడానికి ప్రోత్సహించేవే!

ఈ మిత్రుల మంచితనం, వినిపించిన నీతికథల కారణంగా, ఆటవికుల్లో ఒక యువతి అప్పన్ననూ, మరొక యువతి అబ్దుల్లానూ ప్రేమించారు. వాళ్ళు రహస్యంగా వాళ్ళను కలుసుకుని, "నిన్ను నేను రహస్యమార్గంలో ఇక్కణ్ణించి తప్పిస్తాను. నువ్వు నన్ను పెళ్ళిచేసుకోవాలి," అని ఇద్దరూ విడివిడిగా, వాళ్ళిద్దరికీ చెప్పారు.

మిత్రుణ్ణి వదిలి ఒక్కడూ పారిపోవడానికి అప్పన్న, అబ్దుల్లా కూడా నిరాకరించారు. అంతేకాక, వాళ్ళు ఆటవిక నాయకుడికి ఫిర్యాదు కూడా చేశారు.



నాయకుడు తన వాళ్ళను మందలించి, అప్పన్న, అబ్దుల్లా నిజాయితీని మెచ్చుకుని, "మీ మాటల వల్ల నాకు నాగరికుల పద్ధతులు చాలా తెలిశాయి. నరబలి చేయడం తప్పనిపిస్తున్నది. కానీ దేవత ఆగ్రహిస్తే, మా జాతి సర్వనాశనమై పోతుందని భయంగా ఉంది," అన్నాడు.

అప్పుడు అబ్దుల్లా వాడితో, "నరబలిని ఏ దేవతా మెచ్చుకోదు. నరబలిని విడిచిపెట్టితే మీరు నాగరికులై సుఖపడతారు," అన్నాడు.

"నరబలి చేయకపోతే దేవతకు కోపం రాదని ఋజువు కావాలి!" అని ఆటవికుల నాయకుడు అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

అప్పన్న, అబ్దుల్లా బాగా ఆలోచించి ఒక పథకం తయారు చేశారు. మర్నాడు తమ వద్దకు వచ్చిన ఆటవిక నాయకుడితో, అప్పన్న, "పున్నమినాడు దేవతకు నన్ను బలి ఇవ్వు. అందుకు నా మిత్రుడు అబ్దుల్లా మంత్రం వేసిన కత్తి ఇస్తాడు. దేవతకు బలి ఇష్టమైతే, నేను చావడం జరుగుతుంది. లేదా నీ కత్తి నన్ను చంపనని మొరాయిస్తుంది," అన్నాడు.

ఇది నాయకుడికి విడ్డూరమనిపించింది. కత్తిచంపనని మొరాయిస్తే,దేవతకు నరబలి ఇష్టం లేదని నమ్మడానికి సిద్ధపడ్డాడు.

ఈలోగా అబ్దుల్లా నాయకుడి నడిగి ఒక కత్తి తీసుకుని, మంత్రాల పేరుతో దానికి తన వద్దనున్న అయస్కాంతాన్ని పామి పామి చివరకు దాన్ని అయస్కాంతంగా మార్చాడు. అదే విధంగా ఒక ఇనుప తీగను



కూడా అయస్కాంతంతో పామిపామి అయస్కాంతంగా మార్చి, అప్పన్న మెడలో కట్టాడు. ముందుగాచాలాసార్లు ప్రయోగాలు చేసి చూసి, బలిఖడ్గం అప్పన్న మెడ దగ్గరకు రాగానే వికర్షణకులోనై వెనక్కు నెట్టబడు తున్నదని ధ్రువపరుచుకున్నాడు.

అయస్కాంతానికి ఉత్తర, దక్షిణ ధ్రువాలుంటాయి. సజాతి ధ్రువాలు వికర్షించుకుంటాయి. భిన్న ధ్రువాలు ఆకర్షణకు లోనవుతాయి. ఈ సూత్రాన్నుపయోగించుకుని, అబ్దుల్లా బలిఖడ్గాన్నీ, అప్పన్న మెడలో తీగనూ తయారుచేశాడు.

పున్నమి రానే వచ్చింది. అప్పన్న బలికి సిద్ధమయ్యాడు. అంతా, మిత్రులనుకున్నట్టే జరిగింది. ఆటవిక నాయకుడు బలివ్వడానికి కత్తిని ఎత్తి అప్పన్న మెడదాకా తెచ్చేసరికి, దాన్నెవరో వెనక్కు తోసేస్తున్నట్లనిపించింది.

ఇలా రెండు మూడు సార్లు జరిగాక నాయకుడు కత్తిని అవతల పారేసి, అప్పన్నను బలిపీఠం మీది నుంచి లేపి, మిత్రులిద్దరి కాళ్ళ మీదా పడి, "మీరు నిజంగా మహాగొప్పవారు. దేవత అభిప్రాయం మాకు తెలిసేలా చేశారు. కానీ మేము నాగరికుల మధ్యకు వచ్చి బ్రతకాలంటే, మా దగ్గర డబ్బు లేదు. మీరు మాకొక ఉపకారం చేయాలి. ఇక్కడికి దగ్గర్లో ఒక కొండ గుహ ఉన్నది. అందులో కొండరాక్షసుడుంటున్నారంటారు. వాణ్ణి మేమెప్పుడూ చూడలేదు. కానీ గుహలోకి వెళ్ళిన వాళ్ళెవరూ తిరిగి రాలేదు. ఆ కొండ రాక్షసుడి దగ్గర బోలెడు డబ్బుందిట. అది తెచ్చి మాకివ్వండి!" అని కోరాడు.

ఇందుకు మిత్రులిద్దరూ సమ్మతించారు. అయితే, కొండ గుహలోకి వెళ్ళడానికి నేనంటే నేనని పోటీపడి, చివరకు ఇద్దరూ కలిసి వెళ్ళడానికి నిశ్చయించుకున్నారు.

ఆటవిక నాయకుడు వాళ్ళను కొండ గుహ వద్దకు తీసుకు వెళ్ళాడు. లోపలికి తొంగిచూస్తే చిమ్మచీకటిగా ఉన్నది. మిత్రులిద్దరూ ధైర్యంగా లోపలికి ప్రవేశించారు. తడుముకుంటూ కొంతముందుకు వెళ్ళాక,

వాళ్ళ కళ్ళ ముందు జిగేల్మనే వెలుగు కని పించి, మరుక్షణం ఒక అందమైన యువతి కంటబడింది.

ఆమె అప్పన్నతో, "నీ అంత అందగాడిని నేనెక్కడా చూడలేదు, నన్ను చూసినవాడు నన్ను పెళ్ళిచేసుకుంటే తప్ప బతకడు. కాబట్టి మనంపెళ్ళిచేసుకుందాం," అన్నది.

"మరి నా మిత్రుడి సంగతేమిటి?" అన్నాడు అప్పన్న.

ఆ యువతినవ్వింది. అప్పన్న చూస్తూండ గానే అబ్దుల్లా బూడిదగా మారిపోయాడు.

అప్పన్న మిత్రుడి బూడిద పక్కనే కూర్చుని, "నేనునిన్నుపెళ్ళిచేసుకోను. నన్ను కూడా బూడిదచెయ్యి!"అన్నాడాయువతితో.



"నీకు ఆశ చూపి, మీ ఇద్దర్నీ విడదీద్దా మనుకున్నాను. నా వల్ల కాలేదు. మీ స్నేహం చాలాగొప్పది. అబ్దుల్లా కొద్దిక్షణాల్లో పునర్జీ వితుడౌతాడు. ముందుకు వెళ్ళండి, మేలు జరుగుతుంది!" అని మాయమయిందా యువతి.

కాసేపట్లో బూడిదకుప్ప అబ్దుల్లాగా మారి పోయింది. వాడు అప్పన్న ద్వారా జరిగింది విని, "దేవుణ్ణి నమ్మిన వాడికి ఎవరూ హాని చేయలేరు," అన్నాడు.

ఇద్దరూ ముందుకు వెళ్ళారు. కొంత దూరంపోయేసరికి వాళ్ళకుసన్నగా, పొడుగ్గా వున్న మనిషొకడు కనబడి, కీచుగానవ్వుతూ, "మంచి పాట పాడి నన్ను మెప్పిస్తే, నాకు నచ్చిన వాడికి నిధి చూపిస్తా. నచ్చని వాడిపని అంతటితో సరి!" అన్నాడు.

మిత్రులిద్దరూ గొంతెత్తిశ్రావ్యంగాపాడారు. సన్నపాటివాడు పాట వింటూ ఉత్సాహంగా నాట్యం చేశాడు. పాట ముగియ గానే అప్పన్న విరుచుకునివెనక్కుపడిపోయాడు. అబ్దుల్లా ఇదిచూసి గుండెలుబాదుకుంటూ, "నా మిత్రుడు లేకుండా నేను బతకలేను. వీడు బతికే ఉపాయం చెప్పు," అన్నాడు.

సన్నపాటివాడు జవాబు చెప్పకుండా, అబ్దుల్లా భుజం పట్టుకుని ముందుకు తీసుకుపోయాడు. అక్కడ వాళ్ళకొక పెద్ద భవనం కనబడింది. ఆ భవనంలో ఎక్కడ చూసినా నవరత్నాలు, వజ్రవైడూర్యాలు,



చేయలేరని ఇంకోసారి ఋజువయింది!" అన్నాడు.

ఇంకా ఎలాంటి వింతలు ఎదురౌతాయోనని ఊహించుకుంటూ మిత్రులిద్దరూ ముందుకు వెళ్ళారు. కొంచెందూరం నడిచేసరికి, వాళ్ళకు పర్వతాకారుడైన రాక్షసుడొకడు కనిపించి, పెద్దగా నవ్వి, "మీ స్నేహం చాలా గొప్పది. మీలో ఒకడు ప్రేమకు లొంగలేదు. ఇంకొకడు డబ్బుకు లొంగలేదు. ఎంత ఆలోచించినా, మీ ఇద్దరిలో ఎవరు గొప్ప అన్నది తేలడం లేదు. ఇద్దరూ బాగా ఆలోచించుకుని, సకారణంగా మీ ఇద్దరిలో గొప్పవాడెవడో నాకు చెప్పాలి," అన్నాడు.

"ఎవరు నువ్వు? మా ఇద్దరిలో గొప్పవాడెవడో తెలుసుకోవడంవల్ల, నీక్కలిగే ప్రయోజనం ఏమిటి?" అని అడిగాడు అప్పన్న.

"నన్ను కొండరాక్షసుడంటారు. ఈ గుహ నా సొత్తు. మీలో గొప్పవాడెవడో తేలితే, వాడికిక్కడుండే త్రిలోకసుందరి లాంటి అమ్మాయినిచ్చి పెళ్ళిచేసి, భవనంలో వున్న డబ్బంతా కట్నంగా ఇస్తాను. రెండోవాణ్ణి ప్రాణంతోవుండగా కాల్చుకుతినేసి, పాతాళానికి వెళ్ళిపోతాను," అన్నాడు రాక్షసుడు.

మిత్రులిద్దరూ కొంచెం దూరంగా పోయి మాట్లాడుకున్నారు. వాళ్ళు తమలో తాము, "మనమింతవరకూ సామ దానాలకు లొంగ

వెండి, బంగారు కాసులు— అబ్దుల్లా కళ్ళు చెదిరిపోయాయి.

"ఇదంతా నీ సొంతమైపోతుంది. ఒక వేళ మిత్రుడు బతకాలనుకుంటే, ఇదంతా వెంటనే మాయమైపోతుంది. బాగా ఆలోచించుకుని నిధి కావాలో, మిత్రుడు కావాలో తేల్చుకో!" అన్నాడు సన్నపాటివాడు.

అబ్దుల్లా క్షణంకూడా ఆలోచించకుండానే, "నాకు నా మిత్రుడే కావాలి!" అన్నాడు.

అంతే! అక్కడున్న భవనం, సన్నపాటివాడు కూడా మాయమై అబ్దుల్లా పక్కన అప్పన్న కనిపించాడు.

జరిగిందంతా విని అప్పన్న, "దేవుణ్ణి నమ్ముకున్న వాడికి ఎన్నడూ ఎవరూ హాని

లేదు. ఇప్పుడు వీడు భేదోపాయం పన్నాడు. మన స్నేహం దీనికి లొంగకూడదు!" అనుకుని రాక్షసుడితో, "ఈ ప్రపంచంలో అందరూ సామాన్యులే! మేమిద్దరం కూడా సామాన్యులమే! గొప్ప వాడొక్కడే ఉన్నాడు. ఆయన దేవుడు. ఆ దేవుడి ఆజ్ఞ ప్రకారం ఈ గుహలోని అమ్మాయిని ఆటవికుల నాయకుడికిచ్చి పెళ్ళిచెయ్యి. ఇక్కడున్న సంపదనంతా అతడికి కట్నంగా ఇవ్వు. మమ్మల్నిద్దర్నీ మేము చేరాలనుకుంటున్న పట్నం పొలిమేరల్లో చేర్చు," అని ఏక కంఠంతో అన్నారు.

అంతే! మిత్రులిద్దరి కళ్ళూ జిగేల్మన్నాయి. ఏం జరిగిందో వాళ్ళకు తెలియదు కానీ, కళ్ళు నులుముకొని చూసేసరికి, వాళ్ళు కోరిన విధంగానే పట్నం పొలిమేరలో వున్నారు.

ఆటవికులకు మేలు జరిగి వుంటుందని మిత్రులిద్దరూ అనుకున్నారు. ఇక మీదట ప్రపంచంలో ఏ శక్తి తమను విడదీయకూడదనీ, ఆ విధంగా దేవుణ్ణి ప్రార్థించాలనీ అనుకుంటూ ఆనందంగా ముందడుగువేశారు.

వాళ్ళలా కొంతదూరం వెళ్ళేసరికి బాటకు ఒక ప్రక్కగా గుడీ, మరో ప్రక్కగా మసీదూ కనబడ్డాయి. అప్పుడు ఇద్దరూ కూడా, "అమ్మయ్య! దైవప్రార్థన చేసుకునే అవకాశం వచ్చింది," అనుకుని సంతోషించారు.

అప్పన్న గుడివైపు నడిచాడు. అబ్దుల్లా మసీదువైపు నడిచాడు. ఇద్దరూ కూడా నాలుగడుగులు వేసి వెనక్కు తిరిగి, ఒకేసారి,"అయ్యో!మనం విడిపోయామేమిటి?" అన్నారు.

"అయ్యో! వీళ్ళు ఎంతో మంచివాళ్ళు, వీళ్ళలో స్వార్థం ఏ కోశానా లేదు. వీళ్ళ స్నేహం ఎన్నో అగ్ని పరీక్షలకు తట్టుకుని నిలబడింది. తమ స్నేహం మరింత బలపడాలని, నన్ను ప్రార్థించాలనుకున్నారు. కానీ ఇప్పుడు నా పేరు చెప్పి వీళ్ళు విడిపోయారు!" అని దేవుడా ఇద్దర్నీ చూసి బాధపడ్డాడు.





# తిట్లూ-శాపనార్థాలు

ఒక గ్రామంలో ఒక వడ్డీవ్యాపారి ఉండే వాడు. వాడు పరమ పాపిష్టివాడు. అందు చేత వాడికి ఎప్పుడూ దేవతలు కనిపించక పోయినా పిశాచాలు మాత్రం తప్పక కనిపి స్తూండేవి.

పిశాచాలను చూస్తే మంచివాళ్ళు దడుచు కుంటారు. కాని పాపిష్టివాళ్ళకు పిశాచాల భయం ఉండదు.

ఈ వడ్డీవ్యాపారి ఆ గ్రామంలో ఉన్న ఒక పేదరాలికి అప్పు ఇచ్చాడు. ఆ పేదరాలు ఆరుగురు పిల్లల తల్లి. అకస్మాత్తుగా భర్త పోయాడు. పిల్లలకు ఇంత గంజి కూడా కాచిపోయలేని స్థితిలో ఆవిడ రెండేళ్లక్రితం వడ్డీవ్యాపారి దగ్గిర ముప్పై రూపాయలు అప్పు చేసి తన ఇల్లు తాకట్టు పెట్టింది. మరుసటి ఏడు ఆమె పాతబాకీ చెల్లు వేయ లేకపోగా మరొక పదిహేను రూపాయలు అప్పు చేసింది. వడ్డీవ్యాపారి ఆ బాకీలకు వడ్డీకట్టి, వడ్డీలకు మళ్లీ వడ్డీలుకట్టి, అంతా కలిపి నూరు రూపాయలకు లెక్కతేల్చాడు. పేదరాలుండే ఇల్లు నూరు రూపాయలకన్న ఎక్కువ ఖరీదే ఉంటుంది. అయినా ఆ ఇల్లు ఖాళీచేయించి స్వాధీనం చేసుకుందా మని వడ్డీ వ్యాపారికి దుర్బుద్ధి పుట్టి, ఒకనాటి ఉదయం పథకంప్రకారం వీధిలోకి అడుగు పెట్టాడు.

సరిగ్గా ఆ సమయానికే ఒక పిశాచం తన ఇంటి ముందుగా పోతూ వడ్డీ వ్యాపారికి కనబడింది.

"ఏమిటి గిరాకీ? ఇలా వస్తున్నావు. ఇవాళ మా ఊళ్ళో ఎవరికన్నా మూడిందా ఏం?" అన్నాడు వడ్డీవ్యాపారి పిశాచంతో.

పిశాచం నవ్వి, "నిజమే, మీ ఊరు వచ్చి చాలాకాలమయింది. ఏమన్నాఆహారం దొరు కుతుందేమోనని బయలుదేరి వచ్చాను. నువ్వు ఎంతదాకా?" అని అడిగింది.

పేదరాలి ఇల్లు స్వాధీనం చేసుకో బోతు న్నానని వడ్డీవ్యాపారి, తాను పెట్టిన అప్పు గురించీ, దానిమీద పెరిగిన వడ్డీ గురించీ తిరిగి చెల్లించ లేని పేదరాలి పరిస్థితి గురించీ పిశాచానికి చెప్పాడు.

"అబ్బా, రెండేళ్ళు తిరగకుండానే అసలు కన్న వడ్డీ ఎక్కువయిందే! మీ మనుషులు మమ్మల్ని తెలియక ఆడిపోసుకుంటారు గాని, మీలో మమ్మల్ని మించిన వాళ్లు చాలామంది ఉన్నారు!" అన్నది పిశాచం.

వడ్డీవ్యాపారి ఈ మాటలు విని కొంచెం కూడా ఆగ్రహించకపోగా, మనసులో చాలా గర్వించాడు. ఇతరుల నుంచి ధనం పిండ టంలో తానెంత సమర్థుడైనదీ ఆయనకు తెలుసు.

వారు మాట్లాడుకుంటూ కొంతదూరం వెళ్లేసరికి ఒక పూరిగుడిసెలోంచి ఎవరో స్త్రీ తన కొడుకు మీద కోప్పడటం వినిపించింది. "నిన్ను పిశాచం మింగా! తలుపు జాగ్రత్తగా మూయమని ఎన్నిసార్లు చెప్పినా నీకు జ్ఞాపకం ఉండదేం! మాయదారిపిల్లి వచ్చి కాస్తా వెన్నంతా మింగి పోయింది!" అంటున్నది.

"అదుగో నీకు ఆహారం! ఆవిడ తన కొడుకును నీకు మింగ బెడుతుందిట. హాయిగావెళ్లి మింగు," అన్నాడు వడ్డీవ్యాపారి పిశాచంతో.

పిశాచం నవ్వి, "అది మాటవరసకు అన్న మాటే గాని, ఆవిడ మనస్ఫూర్తిగా తన కొడుకును నాకిస్తాననటం లేదు. ఇంత అను



భవం వున్నవాణ్ణి నాకాపాటి తెలియదా?" అన్నది.

మరికొంత దూరం వెళ్లాక ఒక చోట భార్యాభర్తలు ఒకరినొకరు కోపంతో తెగ తిట్టుకుంటున్నారు. ఒకరినొకరు, "నిన్ను పిశాచం మింగా!" అని తిట్టుకోవటం విని, వడ్డీవ్యాపారి పిశాచం కేసి తిరిగి, "ఇది ఇంకా మంచి అవకాశం! ఒక్క దెబ్బతో ఇద్దరిని మింగవచ్చు!" అన్నాడు నవ్వుతూ.

పిశాచం తల అడ్డంగా తిప్పి, "అవి తిట్లేగాని నిజమైన శాపనార్థాలు గావు. ఆ సంగతి నీకు తెలియదు. మన దారిన మనం పోదాం పద!" అన్నది.

వారు మరి కొంతదూరం నడిచి పేదరాలి ఇల్లు చేరుకున్నారు. వడ్డీవ్యాపారి ఇంటి తలుపు తట్టాడు. పేదరాలు వచ్చి తలుపు తీసి, వడ్డీవ్యాపారిని చూసి, "ఏం నాయనా?" అని పలకరించింది.

"మరేం లేదు, పిన్నీ, నీ బాకీ అసలు ఫాయిదాలు చేరి గొలుసు వడ్డీ లెక్కన నూరు రూపాయలయింది. ఈ ఇల్లేమో నాకు తాకట్టు పెడితివి. ఈ రెండేళ్ల లోనూ ఒక్క దమ్మిడీ చెల్లువెయ్యక పోతివి. నువ్వు మాత్రం ఎక్కణ్ణుంచి తెస్తావులే! ఇల్లు బాకీకి సరిపోతుంది. అందుచేత నువ్వు ఇవాళే ఇల్లు ఖాళీచేసి నాకు స్వాధీనం చేసి బాకీచెల్లువేసుకో. ఈ మాటచెప్పి పోదామని వచ్చాను," అన్నాడు వడ్డీవ్యాపారి.

పేదరాలికి మండిపోయింది. "నీ కడుపు కాలా! నిన్ను పిశాచం మింగా! నలభై అయిదు రూపాయలు చేతిలో పెట్టి ఇల్లు కాజేస్తావట్రా? ఉండు నీ సంగతి చెబుతా," అంటూ లోపలికి వెళ్ళింది.

ఆవిడ వెనక్కు తిరిగిన మరుక్షణం పిశాచం వడ్డీవ్యాపారిని గుటుక్కున మింగి తన దారిన తాను వెళ్ళిపోయింది.

పేదరాలు వడ్డీవ్యాపారికి దేహశుద్ధి చెయ్యడానికి చీపురుకట్ట తీసుకువచ్చేసరికి బయట ఎవరూలేరు. వీధి వీధంతా నిర్మానుష్యంగా ఉంది. "ఇంతలోనే ఏమైపోయాడబ్బా?" అనుకుంటూ పేదరాలు తలుపు వేసుకుంది.



# ప్రకృతి వింతలు




## రాక్షసబల్లుల జాతివి!

ఒకప్పుడు భూమి మీద నివసించిన 'డినోజార్స్' అనే రాక్షసబల్లులకూ, ఈనాటి మొసళ్ళకూ రూపంలో దగ్గరి పోలికలున్నాయి. మొసళ్ళు మామూలుగా పెద్ద పెద్ద మడుగులలోనూ, తటాకాలలోనూ, నదులలోనూ నివసిస్తాయి. వీటిలో ముఖ్యంగా 'క్రోకొడీలి డీ', 'గావి యాలీ డీ' అనే రెండు రకాలు ఉన్నాయి. ఆహారం, అలవాట్లు ఒకటే అయినప్పటికీ ముఖం ఆకారంలో మాత్రం రెంటికీ కొద్దిగా తేడా ఉంటుంది. మొదటి వాటికి వెడల్పాటి నోరు ఉండడమే కాకుండా కింది దవడ నాలుగో పన్ను పెద్దదిగా బయటికి కనిపిస్తూ ఉంటుంది. రెండవ రకం వాటికి పొడవాటి సన్నటి ముక్కూ, ఎత్తయిన ముక్కుపుటాలూ ఉంటాయి. పళ్ళు అంతగా బయటికి కనిపించవు.



## గాండ్రించే పులులు!

ఆగ్రహంతో ఉన్న పులులకు చెవులు నిక్కబొడుచుకుంటాయి. చెవుల మీద గుండ్రటి చారలు కూడా కనిపిస్తాయి. అటువంటివి ఆ క్షణమే ఎదుటివారి మీదికి ఉరుకుతాయి. అయితే, చెవులు నిక్కబొడుచుకోకుండా మామూలుగా ఉన్నప్పుడు పులులు అంతగా కోపంగా లేవని గ్రహించవచ్చు. అలాంటప్పుడు ఎవరైనా ఎదురుపడితే కోరలు చూపుతూ గాండ్రిస్తాయి. ఆ తరవాతే ఉరుకుతాయన్నమాట. మొరిగే కుక్కలు కరవవు అంటారు కదా, అలాగే గాండ్రించే పులులు కూడా వెంటనే పైన పడవని చెప్పవచ్చు!



## అతిప్రాచీనం!

మామూలుగా మామిడి చెట్లు యాభైయేళ్ళు జీవిస్తాయి. అయితే, 1912వ సంవత్సరంలో కోయంబత్తూరులో వ్యవసాయ కళాశాల నిర్మించడానికి కొన్న స్థలంలో అప్పటికే 50 సంవత్సరాలు నిండిన ఒక మామిడి చెట్టు ఉన్నది. అది ఈనాటికీ సజీవంగా ఉండడమే కాకుండా, యేటా 2000 కాయలు కాస్తున్నది. ఒక్కొక్క కాయ 250 గ్రా॥ బరువు ఉంటున్నది. ఈ మామిడి చెట్టుకు ఇప్పుడు సుమారు 140 సం॥ ఉండవచ్చని భావిస్తున్నారు. మనదేశంలోని ప్రాచీన వృక్షాలలో ఒకటైన దీని బోదె చుట్టుకొలత 14 అడుగులు. 40 అడుగుల పొడవుగల వీటి కొమ్మలు బరువుతో విరిగిపోకుండా తగు జాగ్రత్తలు తీసుకుంటున్నారు!

పెద్దవారైన మీ చిన్నారి బాబుకు ఇకమీదట బొమ్మలు అవసరం లేదు. ప్రపంచంలోని విశిష్టమైన తుపాకీ యొక్క నిజమైన థ్రిల్‌ను మీ అబ్బాయికి చవిచూపండి.

ట్రూ-గన్. ఇజ్రేల్ దేశపు శ్రేష్ఠమైన కమాండో యూనిట్ 'మొస్సాద్' రూపొందించిన UZI సబ్‌మెషిన్ గన్‌కు సజీవ ప్రతిరూపం.

అనుభూతి, నిర్మాణంలో పరిపూర్ణత, సైజు, అకారం, ధ్వని - వీటన్నిటిలోను ట్రూ-గన్ అసలును పోలివుంటుంది. ట్రిగ్గర్‌ను లాగేంతవరకూ - అసలుకు, దీనికీ గల తేడా ఏమిటో మీరు చెప్పలేరు!

- శక్తివంతమైన జెట్ ద్వారా నీటిని వేగంగా చిమ్ముతుంది
- అతి వేగంగా, నిరాటంకంగా ప్రేల్చవచ్చును
- పగిలిపోని ఉన్నతస్థాయి ప్లాస్టిక్




- పదునైన అంచులు, లోహపు తునకలూ లేనిది
- నలుపు, ఆలివ్ గ్రీన్, మెటాలిక్ సిల్వర్ రంగులలో లభిస్తుంది



సరికొత్త

# Tru-Gun

**U.Z.I. సబ్ మెషిన్ గన్**

వినోదం దట్టించబడిన సజీవమైన గన్



ధామ్మనిపించే ప్రత్యేక పరిచయపూర్వక తగ్గింపు!

ఈ కూపన్‌ను కత్తిరించి, మీరు ఎప్పుడూ అభిమానించే బొమ్మల దుకాణానికి మాట్ చేస్తే-ట్రూ-గన్ U.Z.I సబ్ మెషిన్ గన్‌పై 5% తగ్గింపు లభ్యమౌతుంది!

పేరు : ..................................................

వయసు : .................... తరగతి : ....................

చిరునామా : ..................................................

..................................................

# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 100/-

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1993 జూన్ నెల సంచికలో ప్రకటింపబడును.



M. Natarajan



Anant Desai

※ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ※ ఏప్రిల్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ※ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. ※ వ్యాఖ్యలు రెండూ పోస్టు కార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి :-
చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 26.

---

## ఫిబ్రవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఎక్కడుంది శాంతి ?

రెండవ ఫోటో : లోకమంతా అశాంతి !

పంపినవారు : పి.ఆర్. ఆదిత్య, c/o పి.ఆర్. ప్రతాప్, నరసింహ టవర్స్, నరసింహనగర్, విశాఖపట్నం.

బహుమతి మొత్తం రు. 100/- నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 48.00

చందా పంపవలసిన చిరునామా :

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు - 600 026

**Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.**

Ishq mera mazhab hai. Rasna Mera Drink Hai.



Yesterday at my school drama, I was like Amitabh Bachchan as in 'Khuda Gawah'. And everyone clapped and applauded. And when I came home you know what Mummy asked? 'So little Ustaad, what do you want to drink?' You know what I said? 'Ishq mera mazhab hai, Rasna Mera Drink Hai.' And then I drank up the whole jug of pyaara Rasna...









I Love You Rasna

More Taste — More Fun

Mudra: EAMR: 6641